ఆర్షగ్రంథమాల - మొదటి మణి: ప్రవ.



# తెనుఁగు గీత

(వ్యాసమహర్షి కృత భగవద్గీతకుఁ దెనుఁగు)



కవి చర్ల గణపతిశాస్త్రి

ఓమ్

ఋషిభ్యో నమః

# ఆర్షగ్రంథమాల

౧ ప్రాచీనాధునాతన ఋషుల గ్రంథ ప్రచురణము.

౨ ఋషుల యాశయముల సమన్వయము.

౩ వర్ణాశ్రమ ధర్మతత్త్వ ప్రచారము.

౪ సర్వ వర్ణ సమ భావము-సర్వోదయ ప్రచారము.

౫ "స్వధర్మమే శ్రేయస్కరము, పరధర్మస్వీకారము భయావహము" అని బోధించుట మూలమున సర్వమత సమత్వ ప్రచారము.

౬ గ్రామాదులందు అహింసా, సత్య, శౌచ, సామ్యాది ధర్మ బోధ.

౭ 'ఆర్షవిద్య' అను పత్రికను నడపుట.

౮ "ఆర్ష విద్యాగురుకులము" అను విద్యాలయమును స్థాపించుట.

౯ గీతోపన్యాసముల ద్వారా పై యాశయములు బోధించుట.

---

• "ఋషులు సత్యవచస్కులు" అని యమరసింహుడు. "జ్ఞాప్యమాన ధర్మానుష్ఠానోత్తర కాలీనులు ఋషులు" అని మాధవాచార్యులు.

ఆర్షగ్రంథమాల : ౧ వ మణిపూస

# తెనుఁగుగీత

(వ్యాసమహర్షికృత భగవద్గీతకుఁ దెనుఁగు)



చర్ల గణపతిశాస్త్రి

ఓమ్

ఋషిభ్యో నమః

# ఆర్షగ్రంథమాల

౧ ప్రాచీనార్వాచీన ఋషుల గ్రంథ ప్రచురణము.

౨ ఋషుల యాశయముల సమన్వయము.

౩ వర్ణాశ్రమ ధర్మతత్త్వ ప్రచారము.

౪ సర్వ వర్ణ సమ భావము-సర్వోదయ ప్రచారము.

౫ "స్వధర్మమే శ్రేయస్కరము, పరధర్మస్వీకారము భయావహము" అని బోధించుట మూలమున సర్వమత సమత్వ ప్రచారము.

౬ గ్రామాదులందు అహింసా, సత్య, శౌచ, సామ్యాది ధర్మ బోధ.

౭ 'ఆర్షవిద్య' అను పత్రికను నడపుట.

౮ "ఆర్ష విద్యాగురుకులము" అను విద్యాలయమును స్థాపించుట.

౯ గీతోపన్యాసముల ద్వారా పై యాశయముల బోధించుట.

---

● "ఋషులు సత్యవచస్సులు" అని యమరసింహుడు, "జ్ఞాన్యమాన ధర్మానుష్ఠానోత్తర కారిణులు ఋషులు" అని మాధవాచార్యులు.

ఆర్షగ్రంథమాల : ౧వ మణిపూస

# తెనుఁగుగీత

( వ్యాసమహర్షికృత భగవద్గీతకుఁ దెనుఁగు )



చర్ల గణపతిశాస్త్రి

మొదటి
ముద్రణము

హక్కులు రచయితవి
వెల: ౦-౮-౦

ప్రతులు
౧౦౦౦

దొరకుచోటు:

చర్ల గణపతిశాస్త్రి,
నిడదవోలు,
పశ్చిమగోదావరి జిల్లా.



'అవంతి' ముద్రాశాల
రాజమండ్రి.

వైశాఖ
నందన
౧౯౫౨

ఉపనిషత్తు లావులు, పితుకువాఁడు కృష్ణుఁడు
పార్థుండు దూడ: జ్ఞానియో భోక్త:
గీతయె క్షీరమున్.

నారాయణుఁ గురుఁ దేవుఁ
దండ్రిన్ మ్రొక్కి వినమ్రతన్
తెన్గింతున్ భగవద్గీత
నే గణపతి నాముఁడన్.

# ఉపక్రమణిక.



అగ్నినుండి విడి నట్లు గనఁబడి వేఱుగాఁ దోఁచు నగ్ని కణములు అగ్నికంటె వేఱు గానట్లు పరమేశ్వరునుండి విడివడినట్లు దోఁచుజీవులు పరమేశ్వరునికంటె భిన్నులు గారు. భ్రాంతివల్ల దుఃఖించు జీవుల భ్రాంతిని బోఁగొట్టి అవ్యయము అద్వైతము ఆనందము నగు పరబ్రహ్మముతో నైక్య మొందించుటకై భగవద్గీతాది గ్రంథములు మహర్షులచే వ్యక్తపఱుపఁబడినవి.

పరమేశ్వరునుండి యాకాశము, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి తేజస్సు, తేజస్సునుండి జలము, జలమునుండి భూమి, భూమినుండి యోషధులు, ఓషధులనుండి యన్నము, అన్నమునుండి జీవులు వెడలుట సృష్టిక్రమము.

మరల జీవులు అన్నమై, అన్నమునుండి యోషధులై ఓషధులనుండి భూమియై, భూమినుండి జలమై, జలమునుండి తేజస్సయి, తేజస్సునుండి వాయువై, వాయువునుండి యాకాశమై, ఆకాశము నుండి పరమేశ్వరుని రూపమై యందు లయమందుట ప్రళయక్రమము.

ఇంక జీవులు స్వస్వకర్మములనుబట్టి యాయా లోక ములు పొందుదురని తెలియుచున్నది.

౧. "బ్రహ్మజ్ఞానులు పరబ్రహ్మమును గాంచినవారు గాన వారేలోకములకుఁ బోనక్కఱలేకుండఁగనే యంతట నిండియుండిన భగవంతునిఁ బొంది వ్యాధి జరా మరణ జన్మ రహితమైన శాశ్వతానంద పదమును బొందుదురు.

౨. యజ్ఞములు జ్ఞానముతోఁ జేసినవారు అర్చిరాది దేవయానమునఁ గ్రమక్రమముగ బ్రహ్మలోకమును బొందు దురు. శ్రుతిస్మృత్యుక్త యజ్ఞములను, పూర్తములు దత్తము లనఁబడు ద్రవ్యయజ్ఞములును, చాంద్రాయణాది తపోయజ్ఞ ములును, ప్రాణాయామాదులగు యోగయజ్ఞములును, మోక్ష శాస్త్రాధ్యయన రూప స్వాధ్యాయ యజ్ఞములును, అంతః కరణశుద్ధిరూప జ్ఞానయజ్ఞములు మొదలగునవియు యజ్ఞపద వాచ్యములు. వాపీ కూప తటాక దేవాలయాన్నదానాది కర్మలు పూర్తములనబడును. శరణాగతరక్షణ ప్రాణ్యహింసా ప్రాణిసేవాదులు దత్తములందురు.

౩. కేవల కర్మపరులు ధూమాది పితృయాణ మార్గ

మునఁ జంద్రలోకము పొంది యక్కడఁ బుణ్యము క్షీణింపఁగాఁ దిరిగి యాకాశాదియానముగ భూలోకముఁ జేరి వారి వారి శుభకర్మనుబట్టి ఉత్తమ మధ్య మాధమ జన్మలను బొందుదురు.

౪. ధనపుత్రాది వ్యామోహము గలిగి శుభకర్మలు చేయని వారు భూలోక నరకలోకములకుఁ బ్రయాణము చేయుచుఁ జావుపుట్టుకలను సర్వవిధకష్టములను బొందుదురు.

౫. యజ్ఞాదులగు నేవిధమైన శుభకర్మలు చేయక తామసులై యుండువారు అజ్ఞానాంధకార భూయిష్ఠమగు పశుపక్షి కీటాది జన్మలను బొందుదురు."

ఇత్యాదికముగ సృష్టి ప్రక్రియాదులను గూర్చియు, జీవుల శుభాశుభకర్మములఁబట్టి కలుగులోకములఁ గూర్చియు శాస్త్రములు చెప్పుచున్నవి.

ఇంక జీవులు చనిపోయినపిదప వారి యింద్రియవ్యాపారములు మనస్సునను, మనస్సు ప్రాణమునను లయమొందఁగా పిదప నాజీవులు సూక్ష్మభూతములతోఁ గూడి స్వస్వ కర్మవశమున ఆయాలోకములకుఁ బోదురు.

ఇట్లు అనేక గతులను బొందు జీవులు అశాశ్వతము లగు స్వర్గాదిలోకాంతరములను, దుఃఖభూయిష్ఠము లగు జన్మలను బొంది కష్టపరంపరలంబడి మునిఁగి పోకుండ రక్షించుటకై తనకంటె భిన్నులు గాని సర్వప్రాణులసేవకై వారి జన్మలలోని దుఃఖములఁ బోగొట్టుటకై శాశ్వతానంద ప్రాప్తికై భగవంతుఁడె వ్యాసమహర్షిద్వారా ఆత్మజ్ఞానమును బోధించుచు ఆ జ్ఞానమునకు సోపానములగు సాంఖ్య కర్మాది యోగములను, సాత్త్విక యజ్ఞాదులను గీతామూలమున నుపదేశించెను. అట్టి భగవద్గీత యుపదేశముల మనోవాకాయ కర్మలచే ఆచరించుచు ధనపుత్రాది వ్యామోహ ముక్తులై సర్వులను భగవంతునివలెఁ జూచి సేవించుచు శుభకర్ములై, ధర్మపరులై జ్ఞానులై జనులు శాశ్వతానంద స్వరూపు లగుదురుగాక!

చర్ల గణపతిశాస్త్రి.

# అధ్యాయక్రమసూచిక.



# ప్రతిదిన పారాయణ క్రమము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧. | ఆది | అధ్యా | ౧ — ౨ | పద్య | ౧౧౯ |
| ౨. | సోమ | ,, | ౩ — ౪ | ,, | ౮౫ |
| ౩. | మంగళ | ,, | ౫ — ౭ | ,, | ౧౦౬ |
| ౪. | బుధ | ,, | ౮ — ౧౦ | ,, | ౧౦౪ |
| ౫. | గురు | ,, | ౧౧ — ౧౨ | ,, | ౭౫ |
| ౬. | శుక్ర | ,, | ౧౩ — ౧౬ | ,, | ౧౦౫ |
| ౭. | శని | ,, | ౧౭ — ౧౮ | ,, | ౧౦౬ |
| | | | మొత్తము పద్యములు. | | ౭౦౦ |

# తెనుఁగుగీత

## మొదటి యధ్యాయము

## అర్జున విషాదయోగము

వ. ధృతరాష్ట్రుఁ డనియె.

* ధర్మంబునకు క్షేత్రంబౌ, కురుక్షేత్రము, పోరుకై
చేరి నావారు పాండవు, లేమి చేసిరి సంజయా ! ౧

వివ :—కురుక్షేత్రము = కురుక్షేత్ర మనుచోటు, కర్మక్షేత్ర మగు దేహమును. నావారు = నాకొడుకులు, నాదిఅను భావము అహంభావముగల రాజసతామసగుణములును. పాండవులు = పాండురాజు తనయులు, పాండువర్ణము గలసాత్త్వికగుణములును.

వ. సంజయుఁ డనియె.

వ్యూహంబులుగఁ బన్నిన, పాండవసేన గన్గొని
దుర్యోధనమహారాజు, గురువుం జేరి యిట్లనెఁ. ౨

---

* ఇది యనుష్టుప్పు ఛందస్సు, మూలభగవద్గీత శ్లోకములవలెఁ జదువవచ్చును.

వ. దుర్యోధనుఁ డనియె.

నీశిష్యుండును ప్రాజ్ఞుఁడౌ, ద్రుపదజుండు వన్నిన
యీపాండవమహాసైన్య, మాచార్య! యిదె చూఁడుమీ ౩

ఇందు విల్కాండ్రు శూరులు, పోరన్ భీమార్జునోపముల్
యుయుధానుండు విరాటుం, డాద్రుపదుల్ మహారథుల్. ౪

వివ:—పదివేలయోధులతో యుద్ధము చేయువాఁడు మహారథుఁడు.

ధృష్టకేతు చేకితానుల్, వీరుఁడౌ కాశిరాజును
పురుజిత్కుంతిభోజులు, నరశ్రేష్ఠుఁడు శైబ్యుఁడున్. ౫

విక్రాంతుఁడు యుధామన్యుఁ, డుత్తమౌజుఁడు శూరుఁడు
ద్రౌపదేయు, లభిమన్యుఁ, డీయందఱు మహారథుల్. ౬

వివ:—ద్రౌపదేయులు = ద్రౌపది కొడుకులు.

మనలో ఘను లెవ్వరో, వారిఁ జూఁడు ద్విజోత్తమా!
నాసేనాపతు లందఱు, నీకు గుర్తిడఁ జెప్పెదన్. ౭

నీవు, భీష్ముండు, కర్ణుండు జయశాలి కృపుండును
అశ్వత్థామ వికర్ణుండు, నాభూరిశ్రవ సైంధవుల్. ౮

నాకై ప్రాణము లర్పింప, శూరు లుండి రనేకులున్
వారు నానాయుధధరుల్, వా రెల్ల యుద్ధకోవిదుల్. ౯

భీష్ముండు నడపు మన, సైన్యముల్ లెక్కలేనివి
భీముండు నడుపు పాండవ, సేనల్ లెక్కింపఁ దగ్గవి. ౧౦

సకలస్థానములందున్, మీమీ చోటుల నుండియే
భీష్మునినే యిఁక మీరల్, జాగ్రత్తఁ గాచుచుండుఁడీ. ౧౧

వ సంజయుఁ డనియె.

తాతయు కురువృద్ధుండు, శూరుండు భీష్ముఁ డప్పుడు
గర్జించి శంఖ మూఁదెను; వానికిఁ గూర్చె మోదమున్. ౧౨

అంత భేరులు శంఖంబుల్, డోళ్లు కాకిలు, మద్దెలల్
వాయింపఁబడె నప్పు డా, శబ్దంబు నిండె నెల్లెడన్. ౧౩

తెల్లగుఱ్ఱాలు పూన్చిన, దివ్య మౌరథ మెక్కియున్
శ్రీకృష్ణార్జును లంతట, నూఁదిరి దివ్యశంఖముల్. ౧౪

కృష్ణుఁడు పాంచజన్యంబున్, దేవదత్తంబు పార్థుఁడున్
భయంకరుండు భీముండు, పౌండ్రశంఖంబు నూఁదెను. ౧౫

ధర్మజుం డూదె ననంత, విజయం బను శంఖమున్
'ఆనకులసహదేవుల్, సుఘోష మణిపుష్పముల్. ౧౬

గొప్పవిల్కాఁడు కాశ్యుండు, మహారథి శిఖండియున్
ధృష్టద్యుమ్న విరాటులుఁ గా, విజయుఁ డైనసాత్యకి. ౧౦

ద్రుపదుండు ద్రౌపదేయుల్, మహాబాహ్వభిమన్యుఁడు
రాజా! వేర్వేఱ శంఖంబుల్, పూరించి రంత నెల్లెడన్. ౧౮

ఆకాశంబున భువియందుం గా, బ్రతిధ్వను లొనర్చుచుం గా
ఆధ్వని ధార్తరాష్ట్రుల, గుండెల్ బ్రద్దలు చేసెను. ౧౯

అంతఁ బోరికి సిద్ధుండై, ధార్తరాష్ట్రులఁ గన్గొని
బాణముల్ వేయుకాలంబు, రాఁగా విల్లెత్తి పార్థుఁడు. ౨౦
కృష్ణునితోడ నీమాటల్, పలికెను మహీపతీ!

వ. అరుసుఁ దనిమె.

"ఇరుసైన్యంబులమధ్యన్, కృష్ణా! నా రథ ముంచుమీ. ౨౧
యుద్ధంబు చేయుకోర్కెతో, వచ్చినవీరిఁ గాంచెదం గా
ఈయుద్ధభూమి వేరితో, నేను యుద్ధ మొనర్తునో. ౨౨
దుష్టుం డౌదుర్యోధనున, కాజిం బ్రియుంబు చేయఁగా
వచ్చి యుద్ధము గావింపఁ, బోయెడివారిఁ జూచెదన్." ౨౩

వ. సంజయుఁ డనియె.

భారతాన్వయ! యీరీతి! పార్థుండు కృష్ణుఁ బల్కఁగా
విరుసైన్యంబులమధ్యన్, దివ్యరథంబు నిల్పియు.  ౨౪
భీష్మద్రోణులయెదుటన్, రాజు లందఱ ముందటన్
కృష్ణుఁ డిట్లనె "నర్జునా! చేరినవీరిఁ జూఁడుమీ.  ౨౫
అందుఁ దండ్రుల తాతల, గురులన్ మామ యన్నలన్
పుత్రపౌత్రుల మిత్రులన్, బార్థుఁ డంతటఁ గన్గొనెన్. ౨౬
ఇరుసైన్యంబులలోనన్, మామగార్లను మిత్రులన్
ఇంకన్ వచ్చినబంధులఁ, జూచి యర్జునుఁ డప్పుడు.  ౨౭
జాలిన్ నిండినమదితో, విచారించుచు నిట్లనెన్

వ. అర్జునుఁ డనియె.

"కృష్ణా! పోరికి వచ్చిన, యీనావారిని జూడఁగా.  ౨౮
నాయంగంబులు సడలెన్, మోమును వాడిపోయెను
ఒడ లంతయు వడఁకుచున్, గగుర్పాటు జనించెను.  ౨౯
గాండీవము చెయిజారెన్, మే నెల్లఁ దగులంబడున్
క్షణమున్ నిలువం జాల, నామనస్సు భ్రమించెడిన్.  ౩౦

ఎన్నో యపశకునంబుల్, గాంచు చుంటిని మాధవా!
యుద్ధములో మనవారిన్, జంపుట మంచి యె ట్లగున్. ౩౧

కృష్ణా! విజయముఁ గోర, గోరఁ రాజ్యము, సౌఖ్యమున్
ఏలా రాజ్యము భోగంబుల్, జీవితం బది యేటికిఁ. ౩౨

రాజ్యమున్ భోగముల్ సౌఖ్య, మెవరికై కోరుచుంటిమో
వా రిదే ప్రాణధనాశల్, విడి వచ్చిరి పోరుకై. ౩౩

గురువుల్ తండ్రులు పుత్రుల్, తాతలు మేనమామలున్
మామగార్లును పౌత్రులు, బావల్ బంధులు వీరిగో. ౩౪

పైఁబడి చంపుచు నున్నన్, స్వర్గరాజ్యంబుకోసమున్
వీరిఁ జంప; నీ భువికా, నేను జంపుదు మాధవా! ౩౫

ధార్తరాష్ట్రులఁ జంపిన, మనకుం బ్రీతి యె ట్లగున్
క్రూరు లైనన్ వీరిఁ జంపఁ, బాపంబే మన కంటును. ౩౬

కావున ధార్తరాష్ట్రులన్, బంధులఁ జంపఁ గూడదు
మనవారిఁ జంపి యెట్టుల్, సౌఖ్య మందెద మచ్యుతా! ౩౭

వీరో యాసన్ మతిచెడి, వంశమున్ జంపుదోషమున్
మిత్రద్రోహపుఁ బాపంబున్, వీక్షింపరుగదా మదిన్. ౩౮

వంశముం జంపుదోషంబు. వీక్షించు మన మైనను
ఈ పాప మంటరా దంచు. నెఱుంగవలదే యిఁకన్. ౩౯

వంశనాశమునన్ బోవున్. బ్రాచీనకులధర్మముల్
ధర్మంబు వోవ నధర్మ. మెదుర్చు నెల్లవంశమున్. ౪౦

అధర్మం బెదుర్పఁ గృష్ణా! స్త్రీలు పాడయి పోదురు
స్త్రీలు పాడయి పోవఁగా, సంకరంబగు వర్ణముల్. ౪౧

సంకరంబె నరకాగ్నిన్. గూల్చున్ గుల, కులఘ్నులన్
పిండోదకముల్ లోపింప, భ్రష్టులౌదురు తత్పితల్. ౪౨

వివ:—కులఘ్నులు = కులము నశింపఁజేసినవారు.

వర్ణసంకర మొందించు, కులఘ్నుల కుకర్మలన్
శాశ్వత కుల ధర్మంబుల్. వర్ణధర్మంబు రూపఱున్. ౪౩

వర్ణధర్మాలు పోయినన్, మనుజుల్ నరకంబులోఁ
దప్పక వసింతు రంచున్, వింటిమిగాదె మాధవా! ౪౪

రాజ్యసౌఖ్యములం దాశన్, మావారిం జంపఁ బూని మే
మయ్యో! యెంత మహాపాప, మాచరింపఁగ నుంటిమి. ౪౫

పగయున్ శస్త్రముల్ వీడి, యున్న నన్నొకవేళ నీ
ధార్తరాష్ట్రులు శస్త్రంబుల్, పూని చంపిన మంచిదే. ౪౬

పార్థుఁ డిట్లని యాజిలో, నెక్కుడు విల్లు వీడిమే
చింతన్ మతి చెడిపోవన్, గూలంబడె రథంబుపై. ౪౭

ఇది
శ్రీమద్వేదవ్యాసమహర్షి రచిత భగవద్గీతలందు,
నుపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగ
శాస్త్రమందు, జనక గురువర చర్ల నారా
యణశాస్త్రి కరుణాలబ్ధవిద్యుఁడగు
గణపతిశాస్త్రిచేఁ దెనుఁగింపఁ
బడిన తెనుఁగుగీతయందు
అర్జున విషాదయోగ
మను మొదటి
యధ్యాయము

# తెనుఁగుగీత

## రెండవ అధ్యాయము

## సాంఖ్యయోగము

వ. సంజయుఁ డనియె.

ఇట్లు దైన్యంబు పైకొనఁ, గన్నీళ్లు నిండు కండ్లతో
దుఃఖించుచున్న యర్జునుఁ, జూచి శ్రీకృష్ణుఁ డిట్లనెఁ. ౧

వివ:—జీవబ్రహ్మైక్యమును దానిని బోధించు శ్రవణాదులును సంఖ్యానించఁబడును, వివరింపఁబడును గాన సాంఖ్యమని వ్యుత్పత్తి.

వ. శ్రీ భగవానుఁ డనియె.

విషమవేళ మోహంబు, పొందెద వేటి కర్జునా!
ఆర్యుల్ మెచ్చరు, స్వర్గమా, రా, దిది కీర్తి గూర్పదు. ౨
చేలవై పోకు; మియ్యది, నీకుఁ గూడదు; నీచమౌ
మనోదౌర్బల్యమున్ వీడి, పార్థ! వేగమె లెమ్ముఁకన్. ౩

వ. అర్జునుఁ డనియె.

భీష్మద్రోణుల్ గడు పూజ్యుల్, యుద్ధములోన వారలన్
వాఁడియౌ బాణములతో, నెట్లు గొట్టుదుఁ గేశవా। ౪

ఈ మహాత్ముల గురుల వధింపకుండ
నవని భిక్ష మెత్తి తినుటయైన మేలు
ఎన్నొ యాశల్ గల గురుల నిందె చంపి
బొక్కుదున నెత్తుటం దోగు భోగములను. ౫

ఏది శ్రేష్ఠమైనదియొ మే మెఱుఁగ మిందు
ఏము గెల్తుమొ వారె జయింతు రొక్కొ
ఎవరిఁ జంపి జీవింప వాంఛింపఁ దలఁప
మిట్టి ధార్తరాష్ట్రులు వారె యిందు గలరు. ౬

దైన్యమున నా స్వభావమౌ ధైర్య మడఁగె
జడుఁడనై ధర్మ మెఱుఁగక యడుగు చుంటి
ఏది మంచిదొ యట నిశ్చయించి చెపుము
యాశ్రయించితి శిష్యుండ నానతిమ్ము. ౭

ఏకచ్ఛత్రాధిపత్యంబున్, స్వర్గరాజ్యముఁ బొందినన్
మర్మముల్ చీల్చు నీబాధ, పోవునా యెఱుఁగన్ గదా. ౮

వ. సంజయుఁ డనియె.

ఇట్లు శ్రీకృష్ణునిం బల్కి. శత్రులఁ జంపు పార్థుఁడుఁ
అంత యుద్ధంబు నేఁజేయ. నని కూర్చుండె నూరకే. ౯
భరతాన్వయ। యీరీతి. నిరుసేనలమధ్యలో
దుఃఖించు పార్థుఁ గన్గొని. నవ్వుచుం గృష్ణుఁ డిట్లనెన్. ౧౦

వ శ్రీభగవానుఁ డనియె.

దుఃఖింపరానివారికై. కుందెదు; బోధ చేసెదు
ఉన్నవారిఁ జన్నవారి. నెంచి కుందరు పండితుల్. ౧౧
నీవు. నే. నీరాజు లెప్డుఁ. లేనివారము కా మిలన్
మన మందఱ మింక ముం. దుండక పోము ఫల్గునా। ౧౨
బాల్య యౌవన వార్ధక్యా. లీమేన నాత్మ పొందు న
ట్లిన్నొ మేనుల్ గనుఁ. దీన మోహ మొందఁడు ధీరుఁడు.
విషయేంద్రియ సంసక్తిఁ. శీతోష్ణ సుఖదుఃఖముల్
గల్గుఁ; నివి వచ్చుఁ బోవు. ననిత్యః మివి సైఁచుము. ౧౪
సుఖంబుఁ దుఃఖమున్ గూడ. సమానంబుగఁ జూచుచు
శీతాది బాధ నొందని. వారె మోక్షంబు గాంతురు. ౧౫

లేనిది యుండ దెప్పుడు, నున్నది పోవ దెన్నఁడున్
తత్త్వవేత్తలె యీరెంటిఁ, నిశ్చయించిరి యిట్టులన్ ౧౬

ఎల్లెడన్ గల యాత్మకు నాశనంబు లేదు చూఁడుమీ
నాశనంబు లేని దీనిని, జంపఁగాఁ జాలఁ డెవ్వఁడున్. ౧౭

ప్రమాణంబుల కందక, నాశంబు లేక నిత్యమై
దేహి యౌ నాత్మకున్ మేనె, నశించుఁ గానఁ బోరుమీ. ౧౮

"ఆత్మ చంపఁబడు" నన్న, వాఁ, "డాత్మ చంపు" నన్నవాఁ
డిద్ద ఱెఱుంగ, రాయాత్మ, చంపంబడదు చావదు. ౧౯

పుట్ట దది చావ దది యెప్పుడును గూడ
పుట్టి యుండి ముందు లేకయుఁ బోదు మరల
పుట్టనిది, నిత్యము, స్థిరంబు, మున్నిటియది
చావ దది యీశరీరంబు చంపఁబడిన ౨౦

"ఆత్మ పోనిది, నిత్యంబు, పుట్టదు మార్పులేనిది"
యని యెఱుంగు మర్త్యుండు, చంపుఁ జంపించు నెవ్వనిన్.

ఎట్టులు నరుండు చిరిగినబట్ట లూడ్చి
తగిన సరిక్రొత్తబట్టలు దాల్చు చుండు

వటులె యీయాత్మ జీర్ణదేహముల విడిచి
తగినసరిక్రొత్తదేహముల్ దాల్చు మరల.		౨౨

అస్త్రంబుల్ చీల్పలే వాత్మన్, గాల్ప లే దగ్ని యాత్మను
ఆత్మన్ నీళ్ళు తడుపలే, వార్పగా లేవు గాలులున్.		౨౩

చీల్ప రాక, కాల్ప రాక, తడ్పరా, కార్ప రాకయున్
నిత్య మెల్లెడ నున్నదై, నిశ్చల మాత్మ స్థాణువౌ.		౨౪

ఆత్మ స్పష్టంబు గాపద, భావన కందరానిది
మార్పు లేని దనంబయుఁ, దెలిసి చింత యేటికిన్.		౨౫

పోని యీయాత్మ యెప్పుడున్, బుట్టుచు, నెప్డు చచ్చుచున్
ఉండు నని తలంతువే, నట్లయ్యుఁ జింత యేటికిన్.		౨౬

పుట్టినవాఁడు చచ్చుట, చచ్చినవాఁడు పుట్టుట
దప్పదు, కానఁ దప్పని, దీనికై చింత యేటికిన్.		౨౭

పుట్టిన మున్నెం దున్నదో, చచ్చిన నెందు నుండునో
ప్రాణిం బుట్టినచే మాత్రు, మిందుకై చింత యేటికిన్.		౨౮

వింతపలె దీని నొక్కఁడు వేడ్కఁ జూచు
వింతవలె దీని నొక్కఁడు వేడ్కఁ బలుకు

వింతవలె దీని నొక్కఁడు వేడ్కఁ వినును
వినియు దీని నొక్కఁడుఁ దెల్పికొనఁగ లేఁడు. ౨౯

అందఱ మేను లందున్న, యీయాత్మ చంపరానిది
కాన నెల్లప్రాణులకై, దుఃఖింపఁదగ దర్జునా! ౩౦

స్వధర్మ మరసి యైనన్, జలింప కుంట యుక్తము
ధర్మయుద్ధంబుకంటెను, మే లేది క్షత్రియాళికిన్. ౩౧

వివ :–స్వధర్మమనఁగా స్వవర్ణధర్మమని పూర్వులు, తనకు స్వభావ
సిద్ధమగు ధర్మమునని నవీనులు.

కోరకె వచ్చుయుద్ధంబు, తెరవఁబడ్డ స్వర్గమే:
అట్టి దానిని గాంతురు, భాగ్యవంతులు క్షత్రియుల్. ౩౨

మరి నీ వీధర్మయుద్ధ, మొనరింపక యుంటివా
యింక స్వధర్మమున్ గీర్తిన్, వీడి గాంతువు పాపమున్.

లోకంబుల్ నీ కపకీర్తిఁ, వచించుఁ శాశ్వతంబుగా
మానధని కపకీర్తి, కంటెను జావె మే లగున్. ౩౪

భీతిఁ యుద్ధము మానితి, వనుకొంద్రు మహారథుల్
వేరి మన్నన, లందితో, వారికిఁ జుల్కఁ నౌదువు. ౩౫

నీశ_క్తిన్ వికసించుచు, నీశత్రుల్ మాట లెన్నియో
యనరాని వంద్రు, దీనిన్, మించిన దుఃఖ మున్నదే. ౩౬

చత్తువా స్వర్గ మొందెదు, గెల్తువా రాజ్య మేలెదు
కాన నర్జున! లే వోయి; యుద్ధంబు చేయు పూనికతో. ౩౭

వివ: — యుద్ధము చేయుము, పోరుమని చెప్పినచోటనెల్ల ఆత్మ పర
మైన యర్థములో నిష్కామముగా నీ విధికృత్యము చేయుమని
యర్థము గ్రహింపవలెను.

ఓటమి గెల్పు; లాభంబు, నష్టంబు; సుఖదుఃఖముల్
సమముగా నెంచి పోరు, మంటదు పాప మిట్టిపో. ౩౮

సాంఖ్యబుద్ధిని జెప్పితిన్, యోగబుద్ధిని వినుమికన్
ఆబుద్ధితోడఁ గూడినఁ గర్మబంధంబు లంటవు. ౩౯

వివ: — సాంఖ్యబుద్ధి = తత్త్వవివేకజ్ఞానము, యోగబుద్ధి = తత్త్వ
వివేకజ్ఞానప్రాప్తికి ఉపాయమైన కర్మాచరణజ్ఞానము.

యోగసాధన వృథ గాదు, దిందేమి లేదు దోషమున్
యోగధర్మంబు సుంతైన, నెంతటిభీతిఁ గాచెడున్. ౪౦

నిశ్చయబుద్ధి యొక్కటె, యీయోగ మందు నిల్పమీ
నిశ్చయశూన్యమూఢుల, బుద్ధు లెన్నో యనంతముల్. ౪౧

వేదార్థవాదముల్ నమ్మి, స్వర్గాదిఫలకర్మలే
తక్క వేఱెవ్వి లేవంచు, వాదింత్రు తీయఁగా జడుల్. ౪౨

వివ:— వేదార్థవాదములను = కర్మకాండయేగాని వేఱే జ్ఞానకాండము లేదనిచెప్పు వేదమందలి యుక్తవాదములను.

కాము లై స్వర్గపరులై, కర్మఫలంబు స్వర్గమున
భోగైశ్వర్యము లొసఁగు, కర్మలె మెత్తు రా జడుల్. ౪౩

భోగైశ్వర్యములం జిక్కి, కర్మోక్తిఁ బుద్ధి పోయిన
మూఢుల మదిఁ గొంచెమున్, నిశ్చయబుద్ధి యుండదు. ౪౪

వివ:— కర్మోక్తిని = కర్మవిశేషములతో నిండిన వాక్యముచే.

వేదంబుల్ త్రిగుణాత్మంబుల్, గుణాతీతుఁడవై సదా
సత్త్వ మొంది, జతల్ దాటి, మేన్ చూడ కాత్మఁ గాంచుమీ.

వివ:—త్రిగుణాత్మములు = సత్త్వరజస్తమోగుణమయ మగు ప్రపంచమును గూర్చి తెలుపునవి, జతలు = సుఖదుఃఖాదిద్వంద్వములు.

ఎల్లెడ నిండి నీరుండ, నూతు లెం తుపయోగమో
అంతే ప్రయోజనం బెల్లవేదంబుల్ బ్రహ్మవేత్తకుఁ. ౪౬

వివ:— స్వల్పానందములు బ్రహ్మానందములోని భాగములే గాని బ్రహ్మానందవేత్తకు, స్వల్పానందమిచ్చు కామ్య కర్మలనుదెలుపు

వేదములందు స్వల్ప ప్రయోజనమే కలుగును గాన బ్రహ్మానం
దమునకై సమ్యగ్బుద్ధిలోఁ గర్మ చేయవలయునని భావము.

కర్మమె నీకు హక్కెప్డు, హక్కు లేదు ఫలేచ్ఛకున్
కర్మఫలహేతు గాకు, మట్లని కర్మ మానకు. ౪౭

వివ: — కర్మఫలహేతువు = కర్మఫల మగు జన్మకు కారణము.

సిద్ధి యైనను గాకున్న, సముఁడవై యవాంఛతో
యోగివై కర్మ చేయుము, యోగం బన సమత్వము. ౪౮

సమబుద్ధి కర్మకంటెన్, ఫలకర్మలు నీచముల్
సమబుద్ధి నాశ్రయింపు, దీనుల్ కర్మఫలప్రియుల్. ౪౯

సమబుద్ధి గలవాని, ముట్టవు పాపపుణ్యముల్
యోగ మూనుము; సమత్వ, కర్మల నేర్పె యోగము. ౫౦

సమబుద్ధి గలప్రాజ్ఞుల్, కర్మఫలంబు గోరక
జన్మబంధంబులం ద్రెంచి, కాంతు రక్లేశ మోక్షము. ౫౧

వివ: — అక్లేశ = రాగ ద్వేషాది క్లేశములు లేని.

మోహపంకంబు నేనాఁడు, నీబుద్ధి దాటి పోవునో
ఆనాఁడు విన్నది, వినన్, దగ్గది లేదు నీ కిలన్. ౫౨

అది యిది విని చెదు, నీబుద్ధి యెప్పు డాత్మలోఁ
జలింపక యచలమై నాఁడె పొందెదు యోగమున్. ౫౩

వ. అర్జునుఁ డనియె.

ఏవి సమాధిలో నున్న, స్థితప్రజ్ఞుని గుర్తులు
స్థితప్రజ్ఞుం డెటు పల్కుఁగా, గూర్చుండు నెట్లు లేగును. ౫౪

వ. శ్రీభగవానుఁ డనియె.

ఎల్ల కోర్కెల వర్జించి, యాత్మయందునె యాత్మచే
నానంద మొందు నాతండె, స్థితప్రజ్ఞుఁడు ఫల్గునా। ౫౫
దుఃఖంబులందుఁ గుందక, సౌఖ్య మందిచ్ఛ లేకయున్
వెతల్ కోర్కెల్ వగల్ లేని మౌనియె స్థిరబుద్ధియౌ. ౫౬
ఎల్లెడన్ వాంఛలం బీడి, శుభాశుభంబు లొందియున్
లో నుబ్బక ద్వేషింపని, వానిప్రజ్ఞ స్థిరం బగున్. ౫౭
తాఁబే లంగములం ముడ్చు. నట్లింద్రియంబు లెల్లెడన్
కోర్కెలనుండి మళ్ళించు, వానిప్రజ్ఞ స్థిరం బగున్. ౫౮
తిండి తినని దేహివి, జెడివు విషయావశుల్
వాంఛయే యుండు, నద్దియుఁ, బోవుం జూచి పరాత్పరున్.

వివ: — విషయావశులు = శబ్ద, స్పర్శాది విషయములు.

ఎంత యత్నించు చుండినఁ, బ్రాజ్ఞుని యింద్రియంబులు
షోరి పెట్టుచు బలిమిగా, మనస్సున్ లాగు నర్జునా ।
శ్రద్ధతో వాని బంధించి, నన్ నమ్మి యుండఁగావలెన్
వేవి కింద్రియముల్ లొంగున్, వాని ప్రజ్ఞ స్థిరంబగుగా.
విషయంబుల ధ్యానించు, ప్రాణుల కందె ప్రీతియౌ
ప్రీతిచేఁ గోర్కె పుట్టును, గోర్కెచేఁ బుట్టుఁ గ్రోధము
క్రోధంబుచేత మోహంబౌ, మోహంబుచే స్మృతుల్ చన
స్మృతి పోవన్ మతి పోవున్, మతి పోవన్ క్షయంబె య
రాగద్వేషములఁగా వీడి, లొంగిన యింద్రియాళితో
విషయాళిన్ జరించుచు, జితాత్ముఁ డొందు శాంతముగా.
శాంతి యేర్పడ నీజ్ఞాని, బాధ లెల్ల నశించును
వేగన్ నిర్మల చిత్తుని, బుద్ధియు నిశ్చలం బగున్.
శ్రద్ధాశూన్యున్ విడున్ బుద్ధి, నిర్బుద్ధిగా విడు భావనల్
భావశూన్యున్ విడున్ శాంతి, యశాంతుగా విడు సౌఖ్యము
ఇంద్రియంబుల్ విషయాళిఁ, జరింప నుండు చిత్తమే
నావగా నీట గాలివలెగా, వాని ప్రజ్ఞ హరించును.

కాన నర్జున! యెవ్వాఁడు, విషయంబులనుండి తా
నింద్రియములన్ నియమింపఁగా, వానిప్రజ్ఞ స్థిరం బగుఁగా.
సర్వప్రాణి కేది రాత్రో, యందే సంయమి మేల్కొనున్
ప్రాణి మేల్కాంచు కాలంబె, రాత్రియౌఁ జూచు మౌనికిన్.
మిగుల నిండియుఁ గదలక మెదల కుండు
నంబుధిని జొచ్చి నదు లైక్యమందు నటుల
నెల్లకోర్కెలు తనలోన నిలుపువాఁడు
శాంతిఁ గనుఁ, గోర్కెఁగలవాఁడు శాంతి గనఁడు. ౭౦
కోర్కె లెల్లను వర్జించి, స్పృహ లేక చరించుచున్
నాది నేనులు వీడినవాఁడె, శాంతిని బొందును. ౭౧
ఇదే బ్రహ్మ మొందు రీతి, దీనిఁ గాంచ భ్రమల్ చనుఁగా
ఇందున్నఁ జివరినాఁడున్, బ్రహ్మనిర్వాణమే గనుఁగా. ౭౨

ఇది శ్రీ... ............గణపతి శాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగుగీతయందు సాంఖ్య యోగ మను
రెండవ యధ్యాయము.

# తెనుఁగుగీత

## మూఁడవ యధ్యాయము

## కర్మయోగము

వ. అర్జునుఁ డనియె.

కర్మకంటెను జ్ఞానంబు, నీవు మేలంచు నెంచితే
మఱి యీ ఘోరపుఁగర్మకా, త్రోయుదు వేల మాధవా। ౧

కంగారు పెట్టుమాటల, నాబుద్ధిన్ మోహ పెట్టెద
వించేది మేలు గూర్చునో, నిశ్చయించి వచియింపుమీ. ౨

వ. శ్రీభగవానుఁ డనియె.

జ్ఞాన యోగముచే సాంఖ్యుల్, కర్మ యోగాన యోగులున్
సిద్ధి పొంద భువిఁ గా మున్ను, చెప్పితిన్ రెండుపద్ధతుల్

వివ:—బ్రహ్మచర్యమునుండియే జ్ఞానముచే సిద్ధి పొందుట మొదటి పద్ధతి. బ్రహ్మచర్యము పిదప గార్హస్థ్యాదికర్మలు చేయుచు సిద్ధి పొందుట రెండవపద్ధతి యని శంకరాచార్యులు.

కర్మల్ చేయనిమాత్రనె, ప్రాణి నిష్కర్మి కాఁడిలఁ
కర్మల్ త్యజించినన్‌గూడ, సిద్ధిని బొందఁ డర్జునా! ౪

క్షణముఁ గర్మ చేయని, పూరుషుఁ డుండఁ డెప్పుడుఁ
ప్రకృతి గుణ వశులై, కర్మ చేయుదు రెల్లరున్. ౫

ఇంద్రియంబులు బంధించి, విషయంబుల మనస్సుచే
ధ్యానించు మందుమూఢుఁడు, మిథ్యాచారుఁ డనంబడున్. ౬

ఇంద్రియంబుల్ మనస్సుచే, బంధించి కర్మయోగమున్
కర్మేంద్రియంబులం జేయఁ, బూనువాఁడె ఘనుం డగుఁ. ౭

కర్మల్ తప్పక చేయుమీ, మానుటకంటెఁ జేయుటే
మే; లిట్లు కర్మ వీడిన, వెళ్ళుమ దేహయాత్రయున్. ౮

యజ్ఞార్థము కావి కర్మల్, లోకంబులకు బంధముల్
యజ్ఞార్థమై యనాసక్తిఁ, గర్మముల్ చేయు మర్జునా! ౯

వివ :— యజ్ఞమన ఈశ్వరుఁ డని శంకరుఁడు, దీన జన సేవయు
వని గాంధి.

యజ్ఞంబుతోఁ బ్రజన్ జేసి, దీనిచే వర్ధిలుం డిదే
మీకోర్కెల కామధేను, వని విధాత మున్ననెఁ. ౧౦

దీనిచే దేవులన్ బెంచుఁ, డా దేవుల్ మిముఁ బెంతురు
ఇట్లొండొరుఁ బెంచుకొంచుఁ, గొప్పశ్రేయస్సు లందుఁడీ.

యజ్ఞసంతృప్త లౌ దేవుల్, మీ కిత్తు రిష్టభోగముల్
వారి కీయ కవి తానే, భుజించువాఁడు దొంగయౌ. ౧౨

యజ్ఞశేషంబు భక్షించు, వారి నే పాప మంటదు
తా మొక్కరె వండి మ్రింగు, పాపుల్ పాపమె తిందురు. ౧౩

ప్రాణు లన్నంబుచేఁ బుట్టు, నన్నంబు మబ్బుచే నగున్
మబ్బు యజ్ఞంబుచేఁ బుట్టు, యజ్ఞంబు కర్మచే నగున్. ౧౪

వివ:—అగ్నియందు వ్రేల్పఁబడిన యాహుతి సూర్యుని బొందు
ననియు, సూర్యునివల్ల వర్షము, వర్షమువల్ల ఆహారము,
ఆహారమువల్ల ప్రాణులు గలుగు నని స్మృతి.

కర్మ బ్రహ్మంబుచేఁ బుట్టు, బ్రహ్మ మక్షరుచే నగుఁ
కాన నెల్లెడ నౌ బ్రహ్మ, మెప్పుడు యజ్ఞమం దగుఁ. ౧౫

ఏవం బిట్లు ప్రవర్తిల్లు, లోకచక్రము ద్రిప్పఁడో
యఘాపాపి యింద్రియాళితోఁ, గ్రీడించి బ్రతుకున్ వృథా. ౧౬
ఆత్మయందే విహరించి, యాత్మలోఁ దృప్తి పొందుచున్
ఆత్మయందే సంతుష్టుఁడు, చేయుకార్యము లేదిఁకన్.
కర్మతోఁ బని లేదింక, మానిన లేమి దోషమున్
ఏప్రాణి నాశ్రయించడు, పని వీనికి లేదఁగా. ౧౮
కాన నెప్పు డనాసక్తిఁ, జేయుందగ్గది చేయుమీ
అవాంఛఁ గర్మలం జేయు, నరుండు మోక్ష మొందును. ౧౯
అవ: — అవాంఛ = నిష్కామబుద్ధితో.
కర్మచేతనె మోక్షంబు, గాంచిరి జనకాదులు
లోకసంగ్రహమునకేన్, గర్మ చేయుట న్యాయమౌ. ౨౦
పెద్ద లేదేది చేయుదు, రదే చేయుదు రన్యులున్
వారి కేది ప్రమాణంబో, లోక మద్దానిఁ గైకొనున్. ౨౧
ముల్లోకంబుల నేనేమి, చేయుందగ్గది లేదు, నేఁ
బొందనిది బొందునది, లే; దైననుంటిఁ గర్మలో. ౨౨
నేనే గనుకఁ గర్మలో, జాగ్రత్త నుండ కున్నచో
నాదారినె పడిపోదు, రెల్లెడ మర్త్యు లర్జునా! ౨౩

నేనె కర్మ చేయకున్న, నీలోకాలు నశించును
సంకరంబు చేసి యుందు, నీప్రజల జంపియుందును. ౨౪

పార్థ! మూర్ఖు లెటుల్ కర్మ, వాంఛతోఁ జేతురో యటుల్
ప్రాజ్ఞుల్ లోకసంగ్రహార్థ, మవాంఛఁ జేయఁగాఁదగున్. ౨౫

కర్మలన్ నమ్ము మూఢుల; బుద్ధిన్ గంగారు పెట్టక
సముఁడై జ్ఞాని చేయుచుఁ, జేయింపవలెఁ గర్మలన్. ౨౬

వివ.—కర్మలను నమ్మి సగము సగము తెలిసినవానికి సర్వము బ్రహ్మమే యని తెలుపరాదు. అట్లు తెలిపినచో వాఁడు బ్రహ్మమును తెలిసికొనలేఁడు. కర్మలనూ చేయఁడు. కాన వానిని గంగారు పెట్టక కర్మలను జేయింప వలయు నని భావము.

ప్రకృతిగుణములచే, జరుగుఁ గర్మ లెల్లెడన్
అహంకార విమూఢాత్ముండు, "దానికిం గర్త నే" ననున్. ౨౭

గుణ కర్మ విభాగంపుఁ, దత్త్వ మెఱుఁగు ధీరుఁడో
యింద్రియంబుల్ విషయాలఁ జేరు నని యసక్తుఁడౌ. ౨౮

ప్రకృతి గుణమోహితు లాశింత్రు గుణకర్మలన్
అల్పజ్ఞులను సర్వజ్ఞుల్, కంగారు పెట్టఁగూడదు. ౨౯

సర్వకర్మలు నాయందె, యుంచి యధ్యాత్మబుద్ధితో
ఆశ, మమత్వము, చింతల్, వర్జించి పోరు వర్తునా। ౩౦

ఈనామతంబు నేమర్త్య, లసూయ లేక శ్రద్ధతో
నెల్లప్పు డాచరింతురో, వారలన్ గర్మ లంటవు. ౩౧

అసూయతోడ నెవ్వ రీ, నామత మాచరింపరో
వా రజ్ఞానుల్ మతిహీనుల్, నశింతు రని యెంచుము. ౩౨

స్వస్వప్రకృతిఁబట్టియే, చేయుచుండును జ్ఞానియున్
ప్రాణుల్ ప్రకృతినే పొందుఁగా, నిగ్రహ మేమి చేయును. ౩౩

వివ :—నిగ్రహము = ప్రకృతిని పొందకను పట్టుదల చేసి ఇంద్రియ
నిగ్రహము. ఇది ప్రకృతిముందర పనికిరాదని భావము.

ఇంద్రియాళికి విషయముం, దుండున్ రాగంబు ద్వేషమున్
వాని వశంబు గాఁగూడ, దవే వానికి శత్రువుల్. ౩౪

సరిగాఁ జేయఁబడిన పరధర్మంబు కంటెను
విగుణంబుగఁ దోఁచియు, స్వధర్మ మదె శ్రేష్ఠము. ౩౫

వివ :—స్వధర్మము = స్వస్వవర్ణాశ్రమ విహితధర్మమని పూర్వులు
స్వస్వభావనియతమైన ధర్మమని నవీనులు.

స్వధర్మ మాచరించెడి. తఱి చావైన శ్రేష్ఠము
అన్యధర్మంబు మంచిదై, తోచియుఁ భీకరం బగుఁ.

వివ: —దీనినిబట్టి స్వధర్మము నాచరించుచునే యుండవలయునేగాని యన్య
మతావలంబనము చేయరాదని తెలియుచున్నది. ఇది సర్వమత
సమత్వమును దెలుపుచున్నది.

వ. అర్జునుఁ డనియె.

అయినన్ మఱి యేనరుఁ ప్రేరేపఁబడి పాఁ దెటుల్
విధి లేక బంటు పోలెఁ, గోరి చేయుఁ బాపముల్. ౩౬

వ. శ్రీభగవానుఁ డనియె

రజోగుణంబునం బుట్టు, కామక్రోధాలె రేపెడున్
వీటి యాఁకలి కంతు లేదివె పాపులు శత్రులున్. ౩౭

నిప్పున్ బొగ గ్రమ్మినట్లు, దు మ్మద్దము నంటి నట్టులున్
గర్భమున్ మావి చుట్టిన, ట్లన్నింటిఁ గ్రమ్ముఁ గామము. ౩౮

జ్ఞానికిన్ నిత్యశత్రువై, చింతల నిండియున్నదై
తృప్తియే లేని కామంబె, జ్ఞానమున్ గప్పు నర్జునా। ౩౯

ఇంద్రియంబుల్ మనోబుద్ధుల్, దీని కాశ్రయ మయ్యెడున్
జ్ఞాన మిదె గప్పి, దేహిన్, వానిచే మోహపెట్టును. ౪౦

కాన నీ వింద్రియంబుల, మున్ముందె నిగ్రహించి యా
జ్ఞాన విజ్ఞానముల్ చంపు, నీపాపిఁ జంపు మర్జునా! ౪౧

గొప్ప వింద్రియముల్ వాని, కంటెఁ జిత్తంబు గొప్పది
దానికంటె బుద్ధి గొప్ప, దాబుద్ధిన్ మించు నాత్మయుగా.

ఇట్లు బుద్ధిగా మించు నాత్మన్, గాంచి యాత్మను నాత్మచేఁ
జక్కఁజేసి గెల్వరాని, కామవైరిని జంపుమీ. ౪౩

ఇది శ్రీ.......................గణపతి శాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగుగీతయందుఁ గర్మ యోగ మను
మూఁడవ యధ్యాయము.

# తెలుఁగు గీత

## నాల్గవ యధ్యాయము

## కర్మయజ్ఞ విభాగ యోగము.

వ. శ్రీభగవానుఁ డనియె.

ఈ నశింపని యోగంబు. సూర్యున కేను జెప్పితిన్
సూర్యుండు మనువు. కాతం. డిక్ష్వాకునకుఁ జెప్పెను. ౧

ఈగతి వచ్చిన దీనిన్. రాజర్షులు గ్రహించిరి
చాల కాలంబున కిది. యుండే నశించె నర్జునా। ౨

భక్తుండ వాప్తుఁడ వని. యాప్రాచీనపు యోగమే
నీకిప్పు డేను జెప్పితి. నది గూఢము శ్రేష్ఠమున్. ౩

వ. అర్జునుం డనియె.

నీజన్మ మిప్పటిది; యే. నాఁటిదో సూర్యజన్మము
నీవాదిఁ జెప్పితి వంచు. నేనిది యెట్లు నమ్ముదున్. ౪

వ. శ్రీభగవానుఁ డనియె.

నాకును నీకును బాలా, జన్మల్ గడచె నర్జునా !
నే నవన్ని యెఱుంగుదు, నీ వెఱుంగవు పాండవా. ౫

చావుఁబుట్టుల లేకుండి, భూతేశునిగ నుండియున్
నాప్రకృతి నధిష్ఠించి, నామాయచేఁ బుట్టుదున్. ౬

ఎప్పు డెప్పుడు ధర్మంబు, పోయి, యధర్మ మెచ్చునో
అప్పు డప్పుడు నేనె నన్నుం, సృష్టించుకొందు నర్జునా ! ౭

సజ్జనులను రక్షింపన్, శిక్షింపన్ దుర్జనంబులన్
ధర్మ సంస్థాప నార్థంబు, ప్రతియుగానఁ బుట్టుదున్. ౮

దివ్య మైనట్టి యానాదు, జన్మ కర్మల తత్త్వమున్
గాంచువాఁడు పునర్జన్మ, లేక నన్జేరు నర్జునా ! ౯

వెతల్ గోర్కెఁ బగల్ వీడి, నన్నెంచి యాశ్రయించుచో
జ్ఞానతపః పవిత్రులై, గాంతు మదైక్య మెందఱో. ౧౦

న న్నెవ్వ రెట్లు గొల్తురో, వారి నట్లె భజించెదన్.
పార్థ ! యన్నివిధాల నా, దారి త్రొక్కెద రీ నరుల్. ౧౧

కర్మఫల మిటన్ గోరి, యజింత్రు దేవ తావళిఁ
తత్కర్మల ఫలితంబో, వేగ నీలోక మందగున్. ౧౨

గుణకర్మలఁ బట్టి నేఁ, జేసితి నాల్గు వర్ణముల్
తత్కర్త నయ్యు నన్నెంచు, మవ్యయుఁగ నకర్తగన్. ౧౩

వివ :— పరమేశ్వరుఁడు సూర్యునివలె గర్తృత్వాభిమానము లేని వాఁడు గానఁ గర్తయైనను గర్త గాఁడని భావము.

నఁ గర్మ లంటవు: నాకున్, లేదు తత్ఫలవాంఛయుఁ
అవి నన్నెఱుంగువానిన్, బంధింపలేవు గర్మముల్ ౧౪

ముక్తిఁ గోరి యిటుల్ పూర్వుల్, తెల్సి చేసిరి కర్మలఁ
కావునఁ బూర్వు లెప్పుడో, చేసిన కర్మ చేయుమీ. ౧౫

కర్మ మే, దకర్మ యేదో, మోహ మొందిరి ప్రాజ్ఞులున్
అశుభంబునుండి ముక్తిఁ, గూర్చు నాకర్మ చెప్పెదఁ. ౧౬

కర్మ కనందగినది, వికర్మయుఁ గనందగున్
అకర్మయుఁ గనందగుఁ, గర్మగతుల్ విగూఢముల్ ౧౭

వివ :— "కర్మ = శాస్త్రవిహితకర్మ, వికర్మ = శాస్త్రవిరుద్ధకర్మ, అకర్మ = కర్తృత్వాభిమానరహితమైన కర్మ" యని శంకరాదులు

"కర్మ యనఁగా సామాన్యకర్మ. వికర్మయనగా హృదయపూర్వక ముగాఁ జేయఁబడెడుకర్మ విశేషకర్మ. అట్లు కర్మ వికర్మతోఁ జేసినచో అకర్మయగు" నని వినోబా.

ఎవ్వఁ డకర్మఁ గర్మలోఁ, గర్మ నకర్మలోఁ గను
వాఁడె ధీమంతుఁ, డాతఁడె, యోగియుఁ గర్మయోగియున్

వివ:—కర్తృత్వాభిమానము లేనిచోఁ జేయకుండినను చేయు వాఁడగును. చేయుచున్నను చేయని వాఁడగును అట్టివాఁడె కర్మ యోగి యని భావము

ఎవ్వాని కర్మ లన్నియుఁ, గామసంకల్ప శూన్యమై
జ్ఞానాగ్నిన్ వ్రేల్వఁగాఁబడు, వానిన్ బండితుఁ డందురు.

వివ:—వ్రేల్వఁగాఁబడు = హోమము చేయఁబడునో.

ఫలేచ్ఛ వీడి నిత్యంబు, తృప్తి నాశ్రయ శూన్యుఁడై
కర్మలోఁ బ్రవర్తించియు, నేమి చేయని వాఁ డగున్. ౨౦

వివ:—ఆశ్రయశూన్యుఁడై = దేహేంద్రియాద్యభిమాన శూన్యుఁడై.

ఆశ లేక, మన స్సొందల్, బంధించి, సర్వభోగముల్
వీడి, దైహికకర్మలె, చేయుచున్ బాప మొందఁడు. ౨౧

వివ :— దైహికకర్మలు = దేహము నిలుచుటకు మాత్రము చేయు కర్మలు.

లభించి నంతతోఁ దృప్తి, పొంది, జంట కతీతుఁడై
సిద్ధ్యసిద్ధులఁ దుల్యుండై, బంధ మొందఁడు చేయుచున్.

వివ :— జంట = సుఖదుఃఖాది ద్వంద్వము.

అసక్తి వీడి ముక్తుఁడై, జ్ఞాన మొందు మనస్సుతో
యజ్ఞార్థంబై కర్మ చేయు, వాని కర్మ క్షయం బగున్. ౨౩

వివ :— యజ్ఞార్థము = ఈశ్వరుని కొఱకు, దీనజనసేవకొఱకును

బ్రహ్మకై బ్రహ్మహవిసున్, బ్రహ్మాగ్నిన్ బ్రహ్మ వ్రేల్చెడున్
బ్రహ్మకర్మబుద్ధిచే వాఁడు, పొందు తాను బ్రహ్మమే. ౨౪
యోగుల్ కొంద ఱుపాసింత్రు, దైవయజ్ఞంబుచే మఱి
మఱి కొందఱు బ్రహ్మాగ్నిన్, వ్రేల్చెద రిష్టి నిష్టిచే ౨౫

వివ :— ఇష్టి = యజ్ఞము.

ఇఁకఁ గొందఱింద్రియముల, వ్రేల్తురు నిగ్రహాగ్నిలో
వేఱొక్కరు విషయాళిఁ, వ్రేల్చెద రింద్రియాగ్నిలో. ౨౬

వివ:— నిగ్రహాగ్నిలో = ఇంద్రియుల నిగ్రహించుటయను నిప్పులో.

జ్ఞానంబుచే వెలిఁగెడి, యింద్రియ నిగ్రహాగ్నిలో
అన్యుల్ సర్వేంద్రియ కర్మల్, ప్రాణ కర్మలు వ్రేల్తురు.—౨౭

ద్రవ్య యజ్ఞుల్, తపో యజ్ఞుల్, స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞులుఁ
యోగ యజ్ఞుల్ గల రిట్లే, సంయముల్ శిత వ్రతుల్.—౨౮

వివ:—వాపీ కూప తటాకాదు లగు పూర్తములను, శరణాగతరక్షణము, భూతములను హింసింపక హితము చేయుట మొదలగు దత్తములను, ద్రవ్యయజ్ఞము లనఁబడును. తపోయజ్ఞములు = చాంద్రాయణ, వాచిక, మానసికాది తపోయజ్ఞములు.

ప్రాణాపాన గతుల్ నిల్పి, ప్రాణాయామ పరుల్ నరుల్
వ్రేల్తు ప్రాణ మపానాగ్నిఁ, బ్రాణాగ్ని నపానముఁ. ౨౯

మితాహారులు కొందఱు, ప్రాణాగ్నిన్ వ్రేల్తు ప్రాణముల్
యీ యజ్ఞవేత్త లందఱు, యజ్ఞాలఁ గూల్తు పాపమున్.౩౦

యజ్ఞశేషామృతంబును, త్రావువా రాద్యుఁ గాంతురు
యజ్ఞ శూన్యున కీలోక, మగు నిహంబె లేదటో. ౩౧

భావ:— యజ్ఞాదులను జేసినపిదప మిగిలిన కాలములో చేయు ధర్మ సహితములగు కర్మ యమృతము. అట్టి యమృతమువంటి యన్నమును దినువారు అద్యులగు నీశ్వరునిఁ జూతురని భావము.

యజ్ఞంబు లిట్లనేకంబుల్, శ్రుతులం జెప్పఁగాఁ బడెన్
అవెల్లఁ గర్మజన్యంబు, లిట్లెంచి ముక్తిఁ గాంతువు. ౩౨

ద్రవ్య యజ్ఞంబుకంటెను, జ్ఞాన యజ్ఞంబు శ్రేష్ఠము
పవిత్ర కర్మ లన్నియు; జ్ఞానమందె లయించును. ౩౩

సాష్టాంగపడి, ప్రశ్నించి, సేవించి యదెఱుంగుమీ
తత్త్వ మెఱింగిన జ్ఞాను, లుపదేశింత్రు జ్ఞానమున్. ౩౪

అజ్ఞానంబుగా గన నిట్లు, మోహ మొంద విఁ కెప్పుడుగా
దానఁ బూర్తిగఁ గాంతువు, ప్రాణుల్ నాలోన నాత్మలో. ౩౫

ఎల్లపాపంబులకంటెఁ, గొప్పపాపంబు చేసియున్
ఆ పాపపు సముద్రంబు, దాటెదు జ్ఞాననావచే. ౩౬

బాగుగ మండునిప్పటుల్, కట్టెల్ భస్మము చేయునో
యట్టులే సర్వ కర్మల, జ్ఞానాగ్ని భస్మ చేయును. ౩౭

జ్ఞానముతో సమానమౌ, పవిత్రము లేదిలన్
తమంతన్ యోగసంస్థాతుల్, దానిన్ గాంచెద రెప్పుడో. ౩౮

జితేంద్రియులు శ్రద్ధాళుల్, తత్పరుల్ గాంత్రు జ్ఞానముఁ
జ్ఞాన మొందిన మహాశాంతి, పొందుదు వెనువెంటనే. ౩౯

శ్రద్ధాహీనులు, నజ్ఞానుల్, సంశయాత్ముల్ నశింతురు
ఇహముఁ బరముఁ లేదు, లేదు సౌఖ్యము వారికిఁ. ౪౦

కర్మల్ యోగముచే వీడి, జ్ఞానాసిన్ సంశయంబులు
ఛేదించి, యప్రమత్తుఁడౌ, జ్ఞాని నంటవు కర్మముల్. ౪౧

కాన నజ్ఞాన జన్యమౌ, లోనున్న సంశయంబుఁ
జ్ఞానాసిఁ గోసి, యోగము, పొందుము లెమ్ము ఫల్గునా! ౪౨

ఇది శ్రీ...............గణపతిశాస్త్రిచేఁ దెనుఁగింపఁబడిన
తెనుఁగుగీతయందుఁ గర్మయజ్ఞ విభాగ యోగ మను
నాల్గవ యధ్యాయము.

# తెలుగు గీత

## అయిదవ యధ్యాయము

## సంన్యాస యోగము.

వ. అర్జునుం డనియె.

కర్మసంన్యాస మనెడు, నందువు కర్మయోగముల
రెంటిలో నేది శ్రేష్ఠము. నిశ్చితంబుగఁ దెల్పుమీ. ౧

వ. శ్రీభగవానుఁ డనియె.

సంన్యాసము కర్మయోగ, మీరెండు మోక్షకారులే
కర్మసంన్యాసముకంటెన్, గర్మయోగంబె శ్రేష్ఠమౌ. ౨

ఎవ్వఁ డల్గఁడో కోరఁడో, నిత్య సంన్యాసి యాతఁడు
రాగద్వేషాది శూన్యుండు, సుల్వుగా బంధముక్తుఁ డౌ. ౩

సాంఖ్యము యోగము మూర్ఖుల్, వేఱందు; రన రార్యులు
బాగుగా నేది చేసినన్, రెండింటి ఫలముల గనుల. ౪

సాంఖ్యుల కేవల మబ్బు, నదే యోగుల కబ్బును
సాంఖ్య యోగా లొకటిగాఁ, జూచెడువాఁడె చూచును. ౫
యోగంబులేక సంన్యాస, మొందుట కష్ట మర్జునా!
యోగయుక్తుఁ డగుమౌని, త్వరలో బ్రహ్మ మొందును. ౬
మేని నింద్రియముల్ గెల్చి, యోగియై శుద్ధాత్ముఁడై
సర్వప్రాణుల కాత్మయై, యంటఁడు కర్మ చేయుచున్. ౭
చూచుచు వినుచు ముట్టుచుఁ; దినుచు మూర్కొంచు వెళ్ళుచున్
సోలు చూర్పుచుఁ బ్రేలుచున్, విడ్చుచుఁ గొనుచుఁ దీయుచున్.
మూయుచు, నింద్రియంబులు, విషయంబుల నుండుటఁ గా
లోనెంచి యోగి, తత్త్వజ్ఞుఁ, డేమి చేయుట లేదనున్. ౯
కర్మల్ బ్రహ్మార్పణ చేసి, యెవ్వఁ డవాంఛఁ జేయునో
వాని నంటవు పాపంబుల్, తామరాకుఁ జలం బటుల్. ౧౦
మేనిచే మదిచే బుద్ధిఁ, గేవల మింద్రియాళిచే
యోగుల్ కోర్కె విడి కర్మల్, చేసెద రాత్మశుద్ధికై. ౧౧
యోగి ఫలాశ వర్జించి, నైష్ఠికశాంతి నొందును
అయోగి కోర్కెలు రేఁగన్, ఫలాశఁ జిక్కి బద్ధుఁడౌ. ౧౨
వివ:—నైష్ఠికశాంతి = సంపూర్ణశాంతి, అయోగి = యోగికానివాఁడు.

సంన్యాస యోగము (౫ అధ్యా)

నవ ద్వారపురిన్ దేహి, చేయింపకయుఁ, జేయక
సర్వకర్మల్ మదిఁ వీడి, జితాత్ముఁడై సుఖుం డగున్

వివ:- నవద్వారపురి = తొమ్మిదిద్వారములు గల పట్టణము శరీ
కండ్లు ౨, చెవులు ౨, ముక్కులు ౨, నోరు ౧, మూత్ర
ద్వారములు ౨ మొత్తము తొమ్మిది.

కర్తృత్వ మేని కర్మలేన్, తత్కర్మఫలసంగ మేన్
ప్రాణికీశుండు సృజింపఁ, డాప్రకృతే ప్రవర్తిలున్.

వేనిపాపముఁ బుణ్యంబున్, గైకొనఁ డీశుఁ డర్జునా!
జ్ఞానమున్ గప్పె నజ్ఞాన, మిదె మోహించుఁ బ్రాణులన్

ఏప్రాణులయాత్మజ్ఞాన, మా యజ్ఞానముఁ గూల్చునో
సూర్యుఁ డట్టు లాజ్ఞానము, దీపింపఁజేయు నీశ్వరున్.

బ్రహ్మబుద్ధుల్, బ్రహ్మపరుల్, బ్రహ్మాత్ముల్ బ్రహ్మ ష్ఠు
జ్ఞానాగ్ని ధూతపాపులై, పొందరు జన్మబంధముల్.

వివ:—బ్రహ్మబుద్ధులు = బ్రహ్మమందు బుద్ధిగలవారు.
పరులు = బ్రహ్మమందాసక్తిగలవారు.

విద్యావినయముల్ గల్గు, బ్రాహ్మణు, నావు, నేనుఁగు
కుక్కన్, జండాలు నైనను, సమతఁ జూతురు పండిత

మనస్సు సమమౌ ప్రాణుల్, గెల్చు నీభువి జన్మముల౯:
బ్రహ్మ, నిర్దోష, మొక్కటే; కాన వారుండ్రు బ్రహ్మలో.

హర్షింపఁడు ప్రియ మ్మొంది, దుఃఖింపఁ డార్తి పొందియున్
స్థిరబుద్ధిన్ మోహ మేఁగన్, బ్రహ్మజ్ఞుఁ డుండు బ్రహ్మలో.

పైపైకోర్కెల్ త్యజించువాఁ, డేసుఖ మాత్మలోఁ గను౯
వాఁడు బ్రహ్మసమాధిలో, నక్షయసౌఖ్య మొందును.

సంసర్గంబునఁ బుట్టెడు, భోగంబుల్ దుఃఖహేతువుల్
వావి కాద్యంతముల్గల్గు౯, జ్ఞాని క్రీడింపఁ డందులో. ౨౨

మేను వీడుటకున్ మున్నే, కామక్రోధాల వేగమున్
సైపంగలఁ డెవం డందే, వాఁడె యోగి సుఖాత్ముఁడు౯ ౨౩

లోలోఁ జొక్కుచు లోలోనఁ, గ్రీడించి, లోనిజ్యోతితో
మించుయోగియు బ్రహ్మమై, బ్రహ్మనిర్వృతిఁ గాంచును. ౨౪

క్షీణపాపుల్, జితేంద్రియుల్, జ్ఞానాసి చ్ఛిన్న సంశయుల్
సర్వభూతహితుల్ మౌనుల్, గాంతురు బ్రహ్మనిర్వృతిన్.

వివః — బ్రహ్మనిర్వృతి = బ్రహ్మానందము.

కామంబు క్రోధముఁ లేక, చిత్తంబు గెల్చి యాత్మఁ గఁ
దర్శించుమౌనుల చుట్టున్, బ్రహ్మానందము వర్తిలుఁ. ౨౬
బాహ్యస్పర్శల్ వెలివైచి, భ్రూమధ్య నిల్పి కన్నులన్
ప్రాణాపానాలు సరిగా, ముక్కులో సంచరింపఁగఁ. ౨౭
వివ:—బాహ్యస్పర్శలు = బాహ్యమైన శబ్దస్పర్శాది విషయములు.
ఇంద్రియంబుల్ మనోబుద్ధుల్, బంధించి మోక్షమగ్నుఁడై
భయక్రోధేచ్ఛలన్ విడ్చు, వాఁ డెప్డు ముక్తుఁడే యగున్. ౨౮
యజ్ఞతపస్సులఁ దించు, సర్వలోకంబు లేలుచుఁ
భూతహితంబుసేయు, నన్ దెలియఁ శాంతి గల్గును. ౨౯

ఇది శ్రీ............గణపతి శాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగు గీతయందు సంన్యాస యోగ మను
అయిదవ యధ్యాయము.

# తెనుఁగుగీత

## ఆఱవ యధ్యాయము

## ధ్యాన యోగము

ఫలంబు గోర కెవ్వండు, చేయందగ్గది చేయునో
వాఁడె సంన్యాసి యోగియుఁ, గాఁ డనగ్ని యకర్మియుఁ౯. ౧

వివ :—అనగ్ని = అగ్నిహోత్రాదికర్మలు చేయనివాఁడు. అకర్మి = కర్మచేయనివాడు.

దేని౯ సంన్యాస మందురో, యదే యోగ మనంబడు౯
సంకల్పముల్ సంన్యసింప, కెవ్వండు యోగి కాఁడిల౯. ౨

యోగంబు పొందఁగోరెడు, మౌనికిఁ గర్మహేతువౌ
యోగ మొందినమౌనికె, శమంబు సాధనం బగు౯. ౩

విషయంబులఁ గర్మల, నెప్డు చిక్కక, సర్వమౌ
సంకల్పముల్ విడువాఁడు, యోగారూఢుఁ డనంబడున్. ౪

ఆత్మచే నాత్మఁ బోషింపు, మాత్మ౯ భ్రష్ట మొనర్పకు
మాత్మయే బంధు వాత్మకు, నాత్మయే శత్రు వాత్మకున్. ౫

ఆత్మచే నాత్మఁ గెల్చిన, యాత్మ యాత్మకు బంధువు
ఆత్మచే నాత్మఁ గెల్వని, యాత్మ యాత్మకు శత్రువు. ౬

మదిన్ గెల్చు ప్రశాంతుని, యాత్మ, మానావమానముల్
శీతోష్ణసుఖదుఃఖంబుల్, సమానంబుగఁ జూచును. ౭

వశియై పెడ్డలున్ రాళ్ళు, బంగార మొకటిగాఁ గని
జ్ఞాన విజ్ఞాన తృప్తుండౌ, స్థిరుండు, యోగి నాఁబడున్. ౮

వివ :— జ్ఞానము = శాస్త్రవిజ్ఞానము, విజ్ఞానము = ఆ జ్ఞానము ననుభవములోనికిఁ దెచ్చుకొనుట.

సుహృదున్ మిత్రునిన్ శత్రు, నుదాసీనుఁ దటస్థునిన్
ద్వేష్యున్ సాధున్ హితున్, పాపిన్ సమంబ చూచు శ్రేష్ఠుడౌ.

మనస్సు మేను బంధించి, యీయఁ గైకోక, కోరక
ఏకాంత ముండి, యొంటియై, ధ్యానింపవలె నాత్మమున్. ౧౦

దర్భలు తోలు వస్త్రంబు, వైచి, యంతెత్తుఁ బల్లమున్
గాని స్థిరాసనంబును, శుద్ధ మౌచోట వెచియున్. ౧౧

ఆసనంబునఁ గూర్చుండి, నిల్చి చిత్తేంద్రియక్రియల్
యోగ మొందవలె నాత్మ, శుద్ధి కేకాగ్రచిత్తుఁడై. ౧౨

మేనిన్ దలన్ మెడన్ సమం, బొనరించి చలింపక
దిక్కుల్ చూడక స్థిరుఁడై, నాసాగ్రంబు గనన్ వలెన్. ౧౩

ప్రశాంతుఁడై నిస్పృహుఁడై, బ్రహ్మచర్యప్రతిష్ఠుఁడై
మచ్చిత్తుండై మనస్వాపి. నన్ నమ్మి యుండఁగా వలెన్.
యోగి యెప్పు డిటుల్ తన్ను, బంధించి జితచిత్తుఁడై
మోక్షమే తుదిగా నొప్పు, నాలోని శాంతి నొందును. ౧౫

అతిగాఁ దిన్నఁ బస్తున్నన్, యోగంబు పుట్ట దెన్నఁడున్
యోగంబు పుట్ట దతిగా, నిద్రింప, నిద్ర మానినన్. ౧౬

సరిగాఁ దిండిఁ దిర్గుచు, సరిగాఁ గర్మ చేయుచున్
సరిగా నిద్ర పోవుచు, లేచు యోగివెతల్ చనున్. ౧౭

నిగ్రహింపఁబడు చిత్త, మాత్మలో నిల్చినప్పుడు
కోర్కె లన్నిటి వీడిన, వాఁడు యుక్తుఁ డనంబడున్. ౧౮

గాలిలేని యెడన్ దీప, మేమి చలింప నటులన్
చిత్త మాఁగిన యోగికిఁ, జయింప దాత్మయోగమున్. ౧౯

యోగసేవన్ మనస్సెప్డు, నిల్చు, శాంతిని గాంచువాఁ
డాత్మచే నాత్మఁ జూచు వాఁ, డాత్మలోనన తుష్టుఁడౌ. ౨౦

బుద్ధి కంది యింద్రియాళి, కందని నిత్యసౌఖ్యమున్
గాంచి ధైర్యముతో నుండఁ, దత్త్వమునుండి జాఱఁడు.

దానిఁ బొంది యికన్ గొప్ప, లాభ మొందఁ దలంపఁడు
అందె యుండి చలింపఁడు, గొప్పదుఃఖంబు నొందియున్.
దుఃఖస్పర్శయె లేకుంట, యోగం బని తలంచుము
విసుగే లేని నిశ్చయ, బుద్ధితో యోగ మొందుము
సంకల్పంబునఁ బుట్టెడు, నెల్లకోర్కెలు పూర్తిగా
వీడి యింద్రియసంఘంబు, మదిచే నిల్పి మెల్లనన్. ౨౪
శాంతించవలె ధీరుండౌ, బుద్ధితో మెల్లమెల్లగా
మనస్సు నాత్మలో నిల్పి, చింతింపఁదగ దెద్దియున్. ౨౫
ఎందెందు మది చంచిత్తం, బెటుల్ బయలుదేఱునో
అందందె దాని బంధించి, లోఁబఱ్పవలె నాత్మకో. ౨౬
మానసంబు ప్రశాంతింప, రజస్సేఁగ, నపాపియై
బ్రహ్మస్వరూపుఁ డై యోగి, పొందు నుత్తమసౌఖ్యమున్. ౨౭
వివ :— అపాపి = పాపములేనివాఁడు.

ఇట్లెప్పు డాత్మఁ జేయుచు, యోగి పాపంబు వీడియుఁ
లీలగా బ్రహ్మతోఁ గల్సి, పొందు నుత్కృష్టసౌఖ్యముఁ
ఎల్లన్ సమంబుగాఁ జూచు, నిర్మలచిత్తుఁ డాత్మమున్
సర్వభూతాలలో, సర్వభూతంబు లాత్మలోఁ గనున్. ౨౯

ఎవ్వఁ డన్నిట నన్గాంచు, నాలో నన్నియుఁ గాంచునో
వానికి నేఁ గనిపింతును, నాకున్ వాఁడు గనంబడున్. ౩౦

అన్నిరీతుల నుండియు, నైక్య మొందిన యోగి, నన్
సర్వభూతంబు లందుండు, నెంచి నాలోన వర్తిలున్ ౩౧

దుఃఖం బైనన్ సుఖం బైనఁ, దనతోపాటె యన్నిటిన్
సరిగా నెవ్వఁడు గాంచు, నాయోగియె ఘనుం డగున్. ౩౨

వ. అర్జునుం డనియె.

సమతన్ గృష్ణ! యేయోగ, మీవు చెప్పితొ యయ్యది
స్థిరంబై యుంటఁ జూడను, చిత్తంబు చలమౌటచే. ౩౩
చిత్తంబు చంచలం, బది, బలిష్ఠంబు దృఢంబునై
క్షోభపెట్టున్ గాలిఁబోలెన్, దాని నాప నశక్యమౌ ౩౪

వ. శ్రీ భగవానుఁ డనియె.

నిస్సంశయంబుగాఁ జిత్త, మాపరానిది చంచలం
బది యభ్యాసముచేతన్, విరక్తిచే గ్రహింపనౌ. ౩౫
మది గెల్వక యోగంబు, దుర్లభం బని యెంచెదన్
మది గెల్చియు యత్నింప, సాధన నద్ది లభ్యమౌ. ౩౬

వ. అర్జునుం డనియె.

శ్రద్ధ యుండి పూన్కి లేమిన్, యోగమునుండి భ్రష్టుఁడై
యోగసిద్ధిన్ గనవివాఁ, డేగతిఁ బొందు మాధవా! ౩౭
బ్రహ్మమార్గంబు నొందక, స్థిరత లేక రెంటికిన్
జెడి నశించునో గాదె, చెదరిపోవు మబ్బటుల్. ౩౮
నా యీ సంశయ మచ్యుతః తీర్ప నేర్తువు పూర్తిగా
నీవు తక్కఁ నిఁ కెవ్వండు దీనిని దీర్పఁ జాలఁడు. ౩౯

వ. శ్రీభగవానుఁ డనియె.

యోగభ్రష్టుండు నశింపఁ, డిహపరాల నాయనా!
మంచి పని చేయు మర్త్యుం, డెవ్వఁడొందఁడు దుర్గతిన్. ౪౦
పుణ్యవంతుల లోకంబుల్, పొంది యెన్నేండ్లో నిల్చియున్
శుచులౌ శ్రీమంతు లిండ్లన్, యోగభ్రష్టుఁడు పుట్టును. ౪౧
పోని ధీమంతులౌ యోగు, లిండ్లయందే జనించు; నీ
లోకమం దిట్టిపుట్టుక, యెంతో దుర్లభ మర్జునా! ౪౨
ఆజన్మన్ బూర్వదేహపు, బుద్ధితో యోగ మొందియున్
సిద్ధికై మరల నింకన్, జేయున్ మిక్కిలి యత్నముల్.

నేదాత్మవశి గాకున్నన్, పూర్వాభ్యాసాన జ్ఞానియౌ
యోగజిజ్ఞాసువుంగూడ, దాటున్ వేదఫలంబులన్. ౪౪

వివ: — యోగభ్రష్టుఁడు ఇప్పుడు జ్ఞానప్రతిబంధకములగు భోగములలో నున్నను బూర్వజన్మపు సాధనలచే జ్ఞానియగును యోగజిజ్ఞాసువు = మోక్షసాధనమును దెలియఁగోరువాఁడు. ఇతఁడును వైదికకర్మ ఫలములను దాటి జ్ఞానాధికారియగునని భావము.

చాలయత్నించుయోగియో, పాపంబు పీడి శుద్ధుఁడై
బహుజన్మలలో సిద్ధిన్, బొంది పొందును సద్గతిన్. ౪౫

యోగి, తపస్వులకంటెన్, జ్ఞానులకంటె శ్రేష్ఠుఁడు
కర్మిష్ఠులకంటె శ్రేష్ఠుఁ, డందుచేఁ గమ్ము యోగివి. ౪౬

వివ: యోగి = తత్త్వజ్ఞానము గలిగిన పిదప మనస్సంకల్పములను వాసనలను నశింపఁజేసికొన్నవాఁడు.

అందఱు యోగులలోనన్, నన్నుఁ బొందు మనస్సుతో
శ్రద్ధతోఁ గొల్చు నెవ్వండు, వాఁడే యోగివరుం డగున్.

శ్రీ... ..........గణపతి శాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగు గీతయందు ధ్యానయోగ మను
ఆఱవ యధ్యాయము.

# తెనుఁగు గీత

## ఏడవ యధ్యాయము

## జ్ఞాన విజ్ఞాన యోగము

వ. శ్రీభగవానుఁ డనియె.

నన్గోరుమదితో యోగ, మొందిన న్నాశ్రయించుచున్
పూర్ణ నన్నెట్లు సరిగాఁ, గాంతువో విను ఫల్గునా। ౧
జ్ఞానంబుతోడి విజ్ఞాన, మిదే పూర్తిగఁ జెప్పెదన్
దానిం దెలియ నింకేదీ, లేదు తెలియఁ దగ్గది. ౨
వేలకొలంది జనులలో, నొక్కఁడే పూనుసిద్ధికై
పూనుసిద్ధులలోను నన్, సరిగా నొక్కఁడే గనున్. ౩
నేల, నీరు, నిప్పు, గాలి, మిన్ను, మనస్సు, బుద్ధియున్
అహంకారం బను నాయీ. ప్రకృతి యెన్మిదై తగున్. ౪
ఇది నీచం, బిఁకన్ వేఱొ, నాదుప్రకృతి గొప్పదై
జీవరూపంబుగా నుండె, నదే ధరించు నీభువిన్ ౫
సర్వభూతాల కీరెండు, ప్రకృతుల్ మూలముల్ సుమీ
నేను సర్వజగత్తులఁ, బుట్టింతు నట్లె చంపుదున్. ౬

నాకంటె వింక గొప్పది, యేదియు లేదు ఫల్గునా।
నాలోనెల్ల గ్రుచ్చఁబడెన్, దారంబున మణుల్పలెన్. ౮
నీట నుందురసం బేను, గాంతిని సూర్యచంద్రులఁ
ఓంకార మౌదు వేదాల, మింట ధ్వనిఁ; బ్రజఁ ధృతిఁ.
భూమిలోఁ బుణ్యగంధంబన్, వహ్నిలోఁ దేజ మయ్యెదఁ
భూతాళిన్ జీవనం బౌదుఁ, దపస్విఁ దపంబను. ౯
సర్వభూతంబులందలి, యనాదిబీజముఁ జూమీ
బుద్ధిమంతులలో బుద్ధిఁ, దేజస్వులందుఁ దేజమున్ ౧౦
శక్తిమంతులలోఁ గోర్కె, రాగమున్ లేని శక్తిని
ప్రాణిన్ ధర్మవిరుద్ధంబు, గాని కామము నర్జునా। ౧౧
ఏయేసత్త్వరజస్తమో, భావముల్ భువిఁ గల్గునో
అవ్వి నావల్లనౌ; నందు, నేనుండ నవ్వి నాయెడన్. ౧౨
త్రిగుణమయ మైనయీ, భావాల మోహ మొంది యీ
జగం బెల్ల గుణాతీతు, నవ్యయు నన్నుఁ గాంచదు. ౧౩
గుణమయ మీ నా దైవ, మాయ దాటఁగ రానిది
న న్నాశ్రయించువారె యీ, మాయ దాటెద రర్జునా। ౧౪
మాయచే జ్ఞానముఁ బోవ, రాక్షసభావ మొందియున్
నన్నుఁ బొందరు మూఢులై, పాపులైన నరాధముల్. ౧౫

ఆర్తుల్ తత్త్వజిజ్ఞాసుల్, ద్రవ్యార్థుల్, జ్ఞాను లర్జునా।
ఈపుణ్యాత్ములు నల్వురున్ నన్నుఁ బ్రేమింతు రెప్పుడున్.
వివ:—ఆర్తులు = ద్రౌపది మొ॥ జిజ్ఞాసులు = జనకుడు మొ॥ ద్రవ్యా
ర్థులు = ధ్రువుఁడు మొ॥ జ్ఞానులు = నారదుఁడు మొ॥ సముచ్చ
యముచే గోపికలు, ధర్మరాజు, కంసుఁడు, శిశుపాలుఁడు మొ॥

శ్రద్ధ నెప్పుడు నగ్గొల్చు, జ్ఞాని శ్రేష్ఠుఁడు వారిలో
జ్ఞాని కే నెంతొ యిష్టుండ. నాతఁడు నాకు నిష్టుఁడౌ. ౧౭

వీరంద ఱుత్తముల్ గానీ, జ్ఞాని నాత్మగ నెంచెదన్
శుద్ధాత్ముఁ డాతఁ డుత్తమ. గతియౌ నన్నె పొందును. ౧౮

ఎన్నో జన్మల చివరన్, "సర్వంబు పరమేశుఁడే"
అంచు జ్ఞానుల్ ననుం గాంతు, రా మహాత్ములు దుర్లభుల్.

ఆ యా కోర్కెన్ జ్ఞాన మేగన్, స్వస్వప్రకృతి వీడక
యా యా నియమముల్ పొంది, సేవింతు రన్యదేవతల్ ౨౦

ఏయేభక్తుఁడు శ్రద్ధతో, నేరూపు గొల్వఁ గోరునో
వానివానికి నందందే, నిశ్చలభక్తిఁ గూర్చెదన్. ౨౧

అతఁ డాభక్తితోఁ గూడి, భజించు నెల్ల దేవులన్
నేనె యిచ్చినకోర్కె లా, దేవులనుండి పొందును. ౨౨

అల్పబుద్ధుల యీఫలం, బింక నశించెడుం జుమీ
దేవభక్తులు దేవులఁ. గాంత్రు; నాభక్తులున్ నమున్ ౨౩

నాశంబు లేక శ్రేష్ఠమౌ, నాపరతత్త్వ మెంచక
మూఢుల్ రూపంబు లేని న, న్నెంతురు రూపధారిగన్ ౨౪
యోగమాయన్ దాగియున్న, నే నందఱకుఁ గన్పడన్
చావుఁబుట్టువు లేని నన్, గాంచ దీమూఢలోకము. ౨౫
మున్పటి విప్పటి పింకన్, రాఁబోవు సర్వభూతముల్
నే నెఱుఁగుదు నన్ను మాత్ర, మవి యెఱుంగ వర్జునా । ౨౬
రాగద్వేషములం బుట్టు, సుఖదుఃఖాదికంబుచే
సృష్టిలో సర్వభూతంబుల్, సంమోహ మొందు ఫల్గునా ।
పుణ్యకర్మలఁ గావించి, నిష్పాపు లౌ దృఢవ్రతుల్
సుఖదుఃఖాదిమోహంబు, వీడి నన్గొల్తు రర్జునా । ౨౮
జరామరణముక్తికై, నన్గొల్వఁ గోరువారలు
ఆ బ్రహ్మ నెల్ల యధ్యాత్మ, నెల్లకర్మలఁ గాంతురు ౨౯
అధిభూతాధిదైవాల, నధియజ్ఞాల నున్న నన్
గాంచువా రంత్యవేళను, నన్గాంత్రు నిర్మలాత్ములై. ౩౦

ఇది శ్రీ.............గణపతిశాస్త్రిచేఁ దెనుఁగింపఁబడిన
తెనుఁగుగీతయందు జ్ఞాన విజ్ఞాన యోగమను
ఏడవ యధ్యాయము.

# తెనుఁగు గీత

## ఎనిమిదవ యధ్యాయము

## అక్షర బ్రహ్మ యోగము.

వ. అర్జునుం డనియె.

పురుషోత్తమ! బ్రహ్మమే, దధ్యాత్మ మేది, కర్మ మే
దధిభూతం బెది, యేది, యధిదైవ మనంబడున్. ౧

ఇం దీతనువున కృష్ణా! యెట్లుండు నధియజ్ఞు
డంత్యకాలంబునం దెట్లు, నిన్నుఁ గాంత్రు జితేంద్రియుల్.

వ. శ్రీభగవానుఁ డనియె.

అక్షరాత్మయె బ్రహ్మంబు, నధ్యాత్మ తత్స్వభావ మా
భూతసృష్టిని వృద్ధిఁ, గూర్చు త్యాగంబె కర్మయా. ౩

వివ:— స్వ = బ్రహ్మమె దేహమందు, భావము = జీవుడుగా నుం
డుట స్వభావము. భూతసృష్టి వృద్ధులను గూర్చు ద్రవ్యాది త్యాగ
కర్మ త్యాగమని భావము.

క్షరంబె యధిభూతంబు, పురుషుం డధిదైవము
ఈదేహమందలి నేనే, యధియజ్ఞంబు ఫల్గునా! ౪

అంత్యకాలంబునన్ నన్నే, యెంచుచు మేను వీడి యే
మర్త్యుఁ డేగునొ వాఁడు నా, యాపొందు నిశ్చయంబుగన్. ౫

ఎవ్వఁ డేరూపు నెంచుచుఁ జివరన్ మేను వీడునో
వాఁ డా రూ పెప్పు భావించి, యా యా రూపమె పొందును.

కావున నెల్లవేళల, నన్ స్మరింపుము, పోరుమీ
నా కర్పింప మనోబుద్ధుల్; నన్నుఁ గాంతు వవశ్యమున్. ౭

అభ్యాసయోగముతో నే, చింత లేని మనస్సుతో
ధ్యానించువాఁడు దివ్యుఁ డౌ, పూరుషుఁ గాంచు నర్జునా। ౮

శాసకునిఁ బూర్వపురుషుని సర్వద్రష్ట
నణువుకంటెను నణు వౌచు నలరువాని
నిఖిలసృష్టికర్త, నచింతనీయరూపు
సూర్యవర్ణుఁ దమోతీతుఁ, జూచు నెవఁడు. ౯

వాఁడు తుదిప్రయాణపువేళ భక్తితోడ
నిశ్చలమనస్సుతో యోగనియతితోడ
కన్బొమలమధ్య ప్రాణంబు క్రమత నిల్పి
సరిగఁ గన్గొను దివ్యుఁ డౌపరమపురుషు. ౧౦

అందు రెద్దాని వేదజ్ఞు లక్షర మని
దేనిఁ జొచ్చెదరు విరాగు లైనయతులు
ప్రాజ్ఞు లెది గోరి బ్రహ్మచర్యము చరింత్రో
యట్టిపరమపదము సంగ్రహము వచింతు ౧౧

ద్వారంబు లెల్ల బంధించి; మనస్సున్ హృది నిల్పియున్
స్వప్రాణంబు తలం జొన్ప, యోగంబును ధరించియున్. ౧౨
"ఓమ్" అను నక్షర బ్రహ్మ మెంచుచు నన్ స్మరించుచున్
మేను వీడి యెవం డేఁగు, వాఁడె పొందును సద్గతిన్. ౧౩
నిత్య మనన్య చిత్తుండై, నన్నెవ్వఁ డెప్పు డెంచునో
యా నిత్యయుక్తుఁడౌ యోగి, కేను లభింతు సుల్వుగా ౧౪
ఉత్తమసిద్ధిని బొందు మహాత్ముల్ నన్నుఁ జేరియున్
దుఃఖంపుటిల్లు నశ్వర మౌ పునర్జన్మ గాంచరు. ౧౫
బ్రహ్మలోకంబువఱకున్ లోకంబుల్ మాటిమాటికిన్
దిరుగుచుండు, నన్జేర, జన్మ లేదింక ఫల్గునా! ౧౬
వేలయుగంబులే రాత్రి, వేలయుగంబులే పవల్
బ్రహ్మ కౌనని కాలజ్ఞుల్ చెప్పుచుండెద రర్జునా! ౧౭
అవ్యక్తమునుండి సర్వమౌ వ్యక్తుల్ పవలు పుట్టును
రాత్రివేళన్ లయం బొందు నవ్యక్త మైన బ్రహ్మలో. ౧౮
ఈ భూతంబులు నాఁటివే పుట్టి పుట్టి యవిష్టతన్
బ్రహ్మరాత్రిన్ లయం బొందుఁ, బగటియందు జనించును.
బ్రహ్మన్ మించి యింకన్ బ్రాఁత, యవ్యక్తభావ ముండె నా
ప్రాణు లెల్ల నశించినన్; నశింప దది యెన్నఁడున్. ౨౦

అవ్యక్త మక్షరం బను, దానిన్ సద్గతి యందురు
దేనిఁ బొందిన మఱిరారో, యదే నాశ్రేష్ఠధామము. ౨౧

భూతంబుల్ వేనిలో నుండు, నిదెల్ల నిండె వేనిచే
నాపరమపురుషుండు, ననన్యభక్తిం లభ్యుఁడౌ ౨౨

ఏకాలమందు యోగులు, మృతిఁబొంది జనించుచున్
జనింపకయు నుందురో, నీకా, కాలము చెప్పెదన్. ౨౩

అగ్ని, జ్యోతి, పవల్, శుక్ల, ముత్తరాయణ మాఱ్నెలల్
వీనియందు జనిపోవు, బ్రహ్మజ్ఞుల్ గాంతురు బ్రహ్మముం దా.

వివ:— "చనిపోయిన పిదప అగ్నిదేవతను పగలునుండి యహర్దేవతను, శుక్లపక్షదేవతను, ఉత్తరాయణదేవతను, సంవత్సరదేవతను దేవలోకదేవతను, వాయులోక దేవతను, సూర్యుని, చంద్రుని మెఱుపును వరుణలోకమును ఇంద్రలోకమును ప్రజాపతిలోకమును క్రమముగఁజేర్చి యొకయమానుషపురుషుఁడు జీవులను బ్రహ్మమును బొందించును. వీరు తిరిగిపుట్టరు" అని శ్రుతి. ఇది అర్చిరాది దేవయానమార్గము.

పొగ, రేల్, కృష్ణపక్షంబు, దక్షిణాయన మాఱ్నెలల్
ఇందు యోగి చంద్రలోక, మొంది మరలఁ బుట్టును ౨౫

వివ:—"ఇందు చనిపోవు కర్మపరులు ధూమమును రాత్రిని కృష్ణ

పక్షదేవతను, దక్షిణాయన దేవతను, సంవత్సర దేవతను, పితృ
లోకమును ఆకాశమును చంద్రునిఁ బొంది యందు భోగములను
భవించి పుణ్యము క్షీణింపఁగా భూమికిఁ దిరిగి వత్తురు" అని
శ్రుతి. ఇది పితృయాణ మార్గము.

శుక్లకృష్ణాఖ్యపక్షంబుల్, జగతిఁ జా స్థిర మౌగతుల్
ఒక్కదానన్ జన్మ మొందఁ, దొందున్ రెండవదానిచే.

వివ:—శుక్లపక్షగతి = అర్చిరాదిగతి, ఇది జ్ఞానసహితముగాన శుక్ల
పక్ష మనఁబడెను. కృష్ణపక్షగతి = ధూమగతి. ఇది జ్ఞానహీనము
గాన కృష్ణపక్ష మనఁబడెను.

ఈదార్లు తెలియఁ జా మోహ, మొందఁడు యోగి యెవ్వఁడున్
కానఁ గాలంబులం దెల్ల, యోగివి కమ్ము ఫల్గునా। ౨౭

తపములందు, యజ్ఞముల, వేదములయందు
దానములను బుణ్యఫల మెంతటిది గలదొ
యదె యతీతించు విది యెల్ల నరయుయోగి
మఱియుఁ బొందును నాద్యమౌ పరమపదము. ౨౮

ఇది శ్రీ..............గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగుగీతయందు అక్షరబ్రహ్మ యోగమను
ఎనిమిదవ యధ్యాయము.

# తెనుఁగు గీత

## తొమ్మిదవ యధ్యాయము

## రాజవిద్యా రాజగుహ్య యోగము.

వ. శ్రీభగవానుఁ డనియె.

అత్యంతగూఢ మౌ జ్ఞాన మొప్పు విజ్ఞాన మీర్ష్యయే
లేని నీ కిదె చెప్పెద, దాన నీదెద వాపదల్. ౧

రాజవిద్య రాజగుహ్య; మిది మేలు పవిత్రమున్
ప్రత్యక్ష జ్ఞేయ మనాశి; ధర్మ్యంబు సుఖలభ్యముగా. ౨

వివ:—రాజవిద్య = విద్యలలోనన్నిటికెల్ల రాజు. రాజగుహ్యము = రహస్యము లన్నిటిలో రాజు. అనాశి = నాశములేనిది.

ఈధర్మంబున శ్రద్ధను బూనని మర్త్యుఁ డర్జునా!
నన్నుఁ బొందకయే మృత్యు సంసారాంబుధిలోఁ బడున్. ౩

అవ్యక్తమూర్తి నౌనాచే నిండె నీజగ మంతయుఁగా
నాలోన సర్వభూతంబు లుండె; నే లేను వాటిలో. ౪

వివ:—నాస్వరూపముగ నాలో భూతములున్నవి. వాస్తవమునకు నేను వానిలో లేనని భావము.

నాయందున్ లేవు భూతంబుల్, చూడునాదివ్యయోగము౯
భూతముల్ దాల్తు; నే నందు, నాయాత్మ పెంచు భూతముల్.

వివ:- సూర్యుడు కదిలకున్నను జలాదిచలనమునుబట్టి సూర్యునికిఁ
గదలిక కల్పించినట్లు దేవునియం దున్నట్లు కల్పింపఁబడినను
వాస్తవమునందు వానిలో భూతములు లేవని భావము.

మింట నెప్పు డున్నగాలి, యెల్లెడ నుండు గొప్పదై
యట్లె నాలోన భూతంబు, లుండు నంచు నెఱుంగుమీ. ౬
కల్పాంత మందు భూతంబుల్, నాప్రకృతి౯ లయించును
కల్పారంభమునన్ వాని, మరలన్ నే సృజించెదన్. ౭
నాప్రకృతిన్ నిగ్రహించి, ప్రకృతివశ మైన యీ
భూతంబు లెల్లఁ బ్రకృతిన్, మఱిన్ మఱి సృజించెదన్. ౮
ఆ కర్మలందుఁ జిక్కక, మధ్యస్థువలె నున్న న
న్నా కర్మ లెప్పుడైనను, బంధింపఁ జాల వర్జునా! ౯
సాక్షినై యుండునావల్లఁ జరాచరజగంబుల౯
బుట్టించున్ బ్రకృతే గాన, నీలోకము భ్రమించును. ౧౦
భూతేశమూర్తి నౌ నాదు, పరతత్త్వ మెఱుంగక
మర్త్యదేహ మూనితి నం, చవమానింత్రు నన్ జడుల్. ౧౧

జ్ఞానంబు కర్మలుఁ గోర్కెల్, బుద్ధులు వ్యర్థమై చనఁ
మోహపెట్టెడి యాసుర, ప్రకృతిం గొల్తు మూర్ఖులు. ౧౨

మహాత్ములైననో దైవ, ప్రకృతి నాశ్రయించి, నన్
భూతాది నవ్యయుం దెల్సి, గొల్తు రనన్యచిత్తులై. ౧౩

నన్నెప్పుడు కీర్తించుచుఁ, బూన్కితో దీక్ష పూనియున్
నిత్యంబు భక్తి మ్రొక్కుచు, నుపాసింతురు శ్రద్ధతో. ౧౪

జ్ఞానయజ్ఞంబుచేఁ గొంద, ఱేకంబుగను వేఱుగా
పల్గతుల విశ్వరూపు, న న్నుపాసింత్రు గొల్చుచున్. ౧౫

నేను గ్రతు; నేను యజ్ఞ, మే నౌషధంబు, నే స్వధన్
మంత్ర మేను; హవి స్సేను. నే నగ్ని; నేను హోమమున్.

ఈజగత్తుకుఁ దండ్రిని, దల్లిఁ, స్రష్టను, తాతను
ఓంకార మేను; వేద్యంబఁ, ఋక్కున్ సామయజుస్సులఁ.

గతిన్, భర్తఁ, బతిన్, సాక్షిఁ, వాసంబ, దిక్కు, మిత్రుఁడన్
జన్మఁ లయంబ, స్థానంబ, రాశి నవ్యయబీజమున్. ౧౮

తపింతున్ వర్ష మాపుదు, వర్షింతు; మృత్యుఁ గూర్చెదఁ
అమృతం బిచ్చెదన్, సత్తు, నసత్తు నేనె ఫల్గునా! ౧౯

వైదికులు సోమరస మూని పాప ముడిగి
క్రతుల నన్నుఁ గొల్చి స్వర్గంబుకై తపింత్రు

వారు పుణ్యమౌ దేవేంద్రపదము నొంది
యచట దివ్యభోగంబుల ననుభవింత్రు. ౨౦

ఆవిశాల మౌ స్వర్గంబు ననుభవించి
పుణ్యము నశింప వత్తురు భువికి మరల
ఎపుడు వేదధర్మ మనుసరించి నరము.
కామపరు లిట్లై రాకపోకలఁ జరింత్రు ౨౧

అనన్యచిత్తులై నన్నుఁ, నెంచి కొల్చుచు నిత్యముగ
స్థిరులై యుండువారల, యోగక్షేమము పూనెదన్. ౨౨

శ్రద్ధతో నన్యదేవుల, నెవ్వారు భజియింతురో
తెలియకుండ వారలున్, నన్నె యజింతు రర్జునా! ౨౩

సర్వయజ్ఞంబుల నేను, భోక్తను ప్రభుండం జుమీ
వారో నన్సరిగాఁ గాంచ, లేక పడెద రందుచే ౨౪

దేవుం గాంత్రు దేవభక్తుల్, పితరుఁ బితృభక్తులున్
భూతభక్తులు భూతాలిన్, నన్గాంత్రు నాదుభక్తులుగ. ౨౫

పత్రమో, పుష్పమో, పండో, నీరో భక్తి నెదిచ్చినన్
భక్తిన్ జితాత్ముఁ డర్పించు, దాని దాని భుజించెదగ. ౨౬

ఏది చేతు, వెది తిందు, వేది వ్రేల్తు వె దిచ్చెదో
ఏది జపింతు వదెల్ల, నాకర్పణ మొనర్పుమీ. ౨౭

ఇ ట్లైనచో శుభాశుభ, ఫలంబౌ కర్మబంధముల్
పోవున్; సంన్యాసయోగివై, ముక్తుఁడై నన్నుఁ గాంతువు.
సర్వభూతాలఁ దుల్యుండ, నాకు లేరు రిపుల్ ప్రియుల్
భక్తితోఁ గొల్చువారిలో, నేనుందు, వారు నాయెడన్. ౨౯
కడున్ దుష్టుండె యయ్యు న, న్ననన్యభక్తిఁ గొల్చుచో
సాధువే యని యెంచనౌ, సాధునిశ్చయుఁ డాతఁడౌ ౩౦

అంత ధర్మాత్ముఁడై వేగ, శాశ్వతశాంతి నొందును
నిశ్చయం బిది, నాభక్తుఁ, డెప్డు నశింపఁ డర్జునా! ౩౧
భక్తులైనస్త్రీలు వైశ్యుల్, శూద్రులు పాపజన్ములున్
న న్నాశ్రయించి యర్జున!, గాంతు రుత్తమ సద్గతిన్. ౩౨
పుణ్యులౌ బ్రాహ్మణుల్ భక్తుల్, రాజర్షుల్ గాంచ రెట్లొకోన్
నశ్వరం బార్తిమయ మౌ, నీజన్మన్ నన్నె గొల్వుమీ. ౩౩
నన్నె భావింపు; నన్ గొల్వు, నన్ ప్రేల్చు, నన్నె మ్రొక్కుమీ
యి ట్లాత్మఁ జేరి నన్ గొల్వ, నన్నె పొందెద వర్జునా! ౩౪

ఇది శ్రీ..................గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగుగీతయందు రాజవిద్యారాజగుహ్యయోగ మను
తొమ్మిదవ యధ్యాయము.

# తెనుఁగు గీత

## పదవ యధ్యాయము

## విభూతి యోగము.

వ. శ్రీభగవానుఁ డనియె.

నామాటల్ విని పొంగెదీవు, నీకు హితంబు గోరుచున్
ఇంక నేఁ జెప్పు నుత్తమ, వాక్యంబుల్ విను ఫల్గునా! ౧
నాదు జన్మ మెఱుంగరు, దేవతలు మహర్షులున్
అన్నివిధాల నే నాదిన్, మహర్షిదేవతాళికిన్. ౨
పుట్టు వాదియు లేనట్టి, లోకేశున్ నన్నెఱింగిన
వాఁడు మర్త్యుల జ్ఞానియై, సర్వపాపంబులన్ విడున్. ౩
బుద్ధి, జ్ఞాన, మమోహంబు, సత్య, దమ, శమ, క్షమల్
సుఖంబు దుఃఖమున్ భీతి, యభీతి, చావుఁబుట్టుకల్. ౪

వివ:—అమోహము = అవివేకముతోఁ బ్రవర్తింపకుండుట.
దమము = బహిరింద్రియ నిగ్రహము. శమము = అంతరిం
ద్రియ నిగ్రహము. క్షమ = ఓర్పు

అహింస, సమతా, తృప్తుల్, దాన కీర్త్యపకీర్తులున్
తప స్సనెడిభావంబుల్, వేర్వేఱ నేన గూర్చితిన్. ౫

పూర్వు లౌసప్తమహర్షుల్, మనుబ్రహ్మలు నల్వురిఁ గా
మద్భావుల్ మనసోజాతుల్, వారి సృష్టియె యీప్రజల్. ౬
నాయీ విభూతిన్ యోగంబున్, సరిగా వేఁ డెఱుంగునో
వాఁ డొందఁగా స్థిరమౌ యోగ, మే సందేహము లేదటన్ ౭
నేనె యంతకు మూలంబు. నాచే నెల్లఁ బ్రవర్తిలున్
అంచు నన్నెంచి కొల్తురు, భావనాయుతు లాబుధుల్. ౮
నా కిచ్చి ప్రాణచిత్తంబుల్. బోధించుకొంచు నొండొరున్
నన్గూర్చి చెప్పుకొం చెప్డు. క్రీడింత్రు తృప్తిగాంతురు. ౯
నిత్యంబు శ్రద్ధధానులై, ప్రీతిన్ భజించువారికిఁ గా
సద్బుద్ధి యోగ మిచ్చెద, వారు నన్గాంత్రు దానిచే ౧౦
వారి ననుగ్రహింపఁగా, నా యజ్ఞానాంధకారముఁ గా
బోఁగొట్టుదున్ మదిన్ నిల్చి, భాసించు జ్ఞానదీపికన్. ౧౧

వ. అర్జునుం డనియె.

పరంధాముఁడవు పర, బ్రహ్మవు పావనుండవు
శాశ్వతుఁగఁ బురుషుఁగా, దివ్యుఁగా నాదిదేవుఁగా ౧౨
అజుఁగా విభుఁగా నిన్ను, దేవర్షి నారదాసితుల్
సర్వర్షుల్ దేవలవ్యాసు, లంద్రు; చెప్పెద వీవును. ౧౩

నాకుఁ జెప్పిన దంతయు, సత్యం బని తలంచెదన్
భగవానుఁడ ! నీజన్మ, మెఱుంగరు సురాసురుల్   ౧౪
భూతపోషక ! భూతేశ ! దేవదేవ ! జగత్ప్రభూ !
పురుషోత్తమ ! యాత్మచే, జూతు వాత్మన్ స్వయంబుగా. ౧౫
ఏయే విభూతులతో నీ, లోకంబుల్ నిండియుంటివో
ఆదివ్య మౌవిభూతులఁ, జెప్పందగును వన్నియున్.   ౧౬
ఓయోగి ! యెట్లు నిన్నెంచి, నేఁ దెల్సికొందు నెప్పుడుఁ
ఏ భావంబుల ధ్యానింపఁ, దగు దో భగవానుఁడా !   ౧౭
నీ యోగము నీవిభూతిఁ, బూర్తిగఁ జెప్పు మింక, నీ
వాక్యామృత మెంత విన్న, నాకేమి తృప్తి గల్గదు.   ౧౮

వ. శ్రీభగవానుఁ డనియె.

ఇప్పుడే నీకుఁ జెప్పెద, దివ్య మౌనావిభూతులన్
ముఖ్యముగ విను పార్థా ! వానికి నంతు లేదిలన్.   ౧౯
సర్వ భూతంబులం దున్న, యాత్మను నేనె యర్జునా !
నేనె భూతముల కాదిన్, నేనె మధ్యము నంతమున్.   ౨౦
ఆదిత్యుల విష్ణు వేను, జ్యోతులలోన సూర్యుఁడన్
మరుత్తులందు మరీచిన్, నక్షత్రంబులఁ జంద్రుఁడన్.   ౨౧

శ్రుతులన్ సామవేదంబ, దేవతలందు నింద్రుఁడన్
ఇంద్రియంబులఁ జిత్తంబన్, భూతంబులందు జ్ఞానమన్.
రుద్రులలో శంకరుఁడన్, యక్షులలోఁ గుబేరుఁడన్
వసువులందు వహ్నిని, కొండలం దేను మేరువన్. ౨౩
పురోహితుల ముఖ్యుఁడౌ, గీష్పతిన్ నేనె ఫల్గునా!
సేనానులందు స్కందుండ, సరస్సుల సముద్రుఁడన్. ౨౪
మహర్షులందు భృగువే, నోంకార మేను వాక్కులన్
యజ్ఞాల జపయజ్ఞంబ, హిమాద్రిన్ స్థావరంబులన్. ౨౫
చెట్లలో రావిచెట్టను, నారదుండన్ సురర్షులన్
గంధర్వులం జిత్రరథుం, దేఁ గపిలుండ సిద్ధులన్. ౨౬
ఆ యమృతంబుతోఁ బుట్టు, నుచ్చైఃశ్రవంబ వాజులన్
ఐరావతంబ నేన్గుల, నరులందు నరేశుఁడన్. ౨౭
ఆయుధంబుల వజ్రంబ, గోవులన్ గామధేనువన్
సంతానంబిడు మారుండఁ, బాములం దేను వాసుకిన్. ౨౮
అబ్జంతుల వరుణుండన్, నాగులం దే ననంతుఁడన్
పితురులన్ బిత్రురాజున్, యముఁడన్ సంయతాత్ములన్.
వివ :— అబ్జంతుల = జలజంతువుల.

ప్రహ్లాదుండను దైత్యులం, గాలంబన్ గణకాళిలో
జంతులం దేను సింహంబ, గరుత్మంతుఁడఁ బక్షులన్. ౩౦
వివ: —గణకాళి = కాలగణనచేయువారు.

పావనంబులలో గాలిన్, రాముఁడ శస్త్రధారులన్
మత్స్యాదుల మకరంబన్, నదులందును జాహ్నవిన్. ౩౧

సృష్టుల కనె యాదివి, నేనె మధ్యము నంతమున్
విద్యలం దాత్మవిద్యను, జల్పకులందు వాదమన్. ౩౨

అక్షరాల నకారంబ, సమాసంబుల ద్వంద్వమున్
నేనె యక్షయకాలంబ, సర్వతోముఖకర్తను. ౩౩

అన్నిటిం జంపు మృత్యువున్, భావిజన్మకు హేతువన్
స్త్రీలకీర్తిన్, సిరిన్, వాక్కున్, స్మృతిన్ మేధన్ ధృతిన్ క్షమన్.
వివ:— స్త్రీలయొక్క కీర్తి మొదలైనవి నేనె యని భావము.

సామలందు బృహత్సామన్, గాయత్రిన్ ఛందసంబులన్
మాసాల మార్గశీర్షంబ, ఋతులలో వసంతుఁడన్. ౩౫

జూదమున్ వంచకులలోఁ, దేజస్సులందుఁ దేజమన్
జయం బేను ప్రయత్నంబ, సాత్త్వికులందు సత్త్వమన్.

యాదవులందుఁ గృష్ణుండఁ, బాండవులందుఁ బార్థుఁడన్
మునులం దేను వ్యాసుఁడఁ, దత్త్వదర్శుల శుక్రుఁడన్. ౩౭

శిక్షించువారిలో శిక్షన్, నీతి నేను జిగీషులన్
గోప్యంబులందు మౌనంబన్, జ్ఞానులం దేను జ్ఞానమన్.

సర్వభూతంబుల కెది, బీజమో నే నదర్జునా।
నేను లేని చరాచర, భూతంబు లెందు లేవిలన్. ౩౯

దివ్య మౌనావిభూతుల, కంతంబు లేదు ఫల్గునా।
విభూతివిస్తరం బిది, చెప్పితిన్ సంగ్రహంబుగా. ౪౦

విభూతి గల దేదేదో, యేదేది శుభయుక్తమో
అయ్య దయ్యది నాతేజు, సంశం బని యెఱుంగుమీ. ౪౧

పోవి వేమేల యిదెల్లన్, దెలియ నేల యర్జునా।
నే నీ సర్వజగ మ్మొక్క, యంశచే నిల్పి యుంటివి. ౪౨

ఇది శ్రీ.........................గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగుగీతయందు విభూతి యోగ మను
పదవ యధ్యాయము.

# తెనుఁగు గీత

## పదునొకండవ యధ్యాయము

## విశ్వరూపదర్శన యోగము

వ. అర్జునుం డనియె.

అనుగ్రహింపఁగా నన్ను, గూఢ మౌనాత్మ తత్త్వమున్
గూర్చి యేమేమి చెప్పితో, దాన నామోహ మేగెను. ౧
నీవల్ల విస్తరంబుగా, భూతసృష్టి లయంబులన్
అక్షయం బైన మాహాత్మ్య మిప్పుడే వింటి మాధవా। ౨
ఆత్మఁ గూర్చి పరమేశా। నీ వన్నట్లిది యంతియే
నీయైశ్వ రాకృతిన్ జూడఁ, గోరెదఁ బురుషోత్తమా। ౩

వివ :—ఈశ్వరుఁడు=జ్ఞానైశ్వర్యశక్తి బలవీర్యతేజస్సంపన్నుఁడు.

అది నేఁ జూడ శక్యంబౌ, నని నీవు తలంచినన్
యోగేశ్వర। నశింపని, నీయాత్మ నాకుఁ జూపుమీ. ౪

వ. శ్రీ భగవానుఁ డనియె.

పార్థ। చూడుము వందలు, వేనవేల్ నానారూపముల్
పలువిధం బవి దివ్యంబు, లనేక వర్ణ రూపముల్. ౫

చూడు మాదిత్యవసులన్, రుద్రాశ్వి మరుత్తులన్
ఎన్నఁడు నీవు చూడని, వింత లన్ చూడు ఫల్గునా! ౬

ఈ నా మేనున నొక్కచో, మ[illegible]చరాచరంబుతో
లోకంబుల్ చూడు మింకేది, చూడఁ గోరెద వర్జునా! ౭

నన్ను వీక్షింపఁగాఁ జాల, ప్రాకృతపుఁ గంటితో
దివ్యనేత్ర మిత్తుఁ జూడు, నా యైశ్వర్యయోగమున్. ౮

వ. సంజయుఁ డనియె.

రాజా! యిట్లని యాపల్కి, యోగేశ్వరుఁడు కృష్ణుఁడు
చూపించె నర్జునునకు, [illegible] విశ్వరూపముగా. ౯

ఎన్నో మోములు గన్నులు, నెంతో వింతగు రూపముగా
దివ్యభూషలు వస్త్రంబుల్, గల్గు నాదేవుఁ జూపెను. ౧౦

దివ్య మాలలఁగా బట్టల్, మంచిగంధంబు దాల్చిన
సర్వాద్భుతున్ దేవుఁ జూపె, ననంతు విశ్వతోముఖున్. ౧౧

మింటిపై వేయిసూర్యులు, నొక్కమాఱుదయించుచోఁ
గల్గు కాంతియె యావిశ్వ, మూర్తికాంతికిఁ దుల్యమౌ. ౧౨

అం దర్జునుండు చూచెను, దేవదేవుని మేనునఁ
ఏకస్థం బౌ జగం బెల్ల, ననేకంబుగ నున్నటుల్. ౧౩

ఆశ్చర్య మొంది ఫల్గునుఁ, డంతఁ గగుఱుపాటుతో
దేవుఁ బ్రమొక్కి, శిరస్సున, నంజలిఁ గూర్చి యిట్లనెన్.

వ. అర్జునుం డనియె.

దేవ ! నీమేనున సమస్తదేవతలను
వివిధభూత సంఘముల విశ్వేశుఁ డగు
పద్మపీఠమునం దున్న బ్రహ్మదేవు
మునుల, దివ్యోరగుల, నిదే గనుచు నుంటి. ౧౫

కంట్లు మోములు పొట్టలు కరము లొప్ప
నెల్లెడ ననంతరూపి వౌచున్నఁ గాంతు
విశ్వరూప ! విశ్వేశ ! యేవిధిని నీకు
నంతమును మధ్య. యాదియు నరయ నయ్య. ౧౬

గదయు మణికిరీటంబు చక్రమును దాల్చి
తేజపుం బుంజ మెల్లెడ దీప్తు లొలుకఁ

జాడ రాక, యెల్లెడ వెల్గుసూర్యవహ్ని
లటు లెసఁగు నప్రమేయు, విన్నరయు చుంటి. ౧౭

ఎఱుఁగఁదగి నాశ మొందని పరుఁడ వీవు
సకల మగునీజగతికి నాశ్రయమ వీవు
అక్షరుఁడవు శాశ్వత ధర్మ రక్షకుఁడవు
ఆ సనాతన పురుషుండ వని తలంతు ౧౮

నడుమ, తుది, మొదల్ లేక, యనంతబల, మ
నంతబాహులు, రవిచంద్రు లనెడికనులు
గలిగి, మోమున నగ్నియు వెలుఁగ, జగము
నెల్లఁ దేజుచే వెల్గించు నిన్నుఁ గాంతు. ౧౯

ఈ సకల భూనభో మధ్య దేశమందు
నెల్ల దిశల నీ వొకఁడవే నిండి యుంటి
వరయ రాని యీ యద్భుతమైనరూపు
గని త్రిలోకముల్ భీతి నొందెను మహాత్మ ! ౨౦

సురగణంబులు నీలోనఁ జొచ్చుచుంటి
రిదె కొందరు భీతిని దోసి లిడి నుతింత్రు

స్వస్తి యని మహోఋషి సిద్ధసంఘములును
స్తుతి యొనర్చుచుండిరి నిండు స్తుతుల విన్న — ౨౧

రుద్రులును, సాధ్యు, లాదిత్యులును వసువులు
విశ్వదేవుల్, మరుత్తు, లశ్వినులు పితరు
లసుర గంధర్వ యక్ష సిద్ధాది గణము
లరయుచున్నారు విన్నిదే యచ్చెరువున. — ౨౨

చాల ముఖములు, కన్నులు, కాళ్ళు, తొడలు
బాహువులు, పొట్టలును గల్గి బహుళదంష్ట్ర
లెంతో భయపెట్టు నీ మహాకృతిని గాంచి
భువనములు నేను వ్యథ గాంతు మో మహాత్మ! — ౨౩

వెలిఁగి, మిన్నంటి, రంగురంగులను మెఱసి
నోర్లు తెఱచి మండెడి పెన్గనుల నెసఁగు
నినుఁ గనుంగొని, వ్యథ చెందు మనసుతోడ
ధైర్య మొందను, శాంత మొందను ముకుంద! — ౨౪

కోరలను గ్రూరమై లయకాలవహ్ని
వోలె మండెడి నీదు మోములను గాంచి

దిక్కు లెఱుఁగను. సుఖము శాంతియును గాంచ
నన్ను దయఁ జూడు మీశ! జగన్నివాస! ౨౫

ధరణి పాలురతోపాటు ధార్తరాష్ట్రు
లెల్లరును, భీష్ముఁడును ద్రోణుఁ డింకఁ గర్ణుఁ
డట్టులే మనలోని యోధాగ్రగణ్యు
లెంతొ త్వర పూని నిన్ బ్రవేశింతు రిదిగొ. ౨౬

వారు దంష్ట్రలఁ గ్రూరమై భయద మౌచు
నొప్పు నీవక్త్రగుహఁ జొచ్చు చున్నవారు
చూర్ణ మగు శిరస్సులతోడఁ జూడఁబడెద
రొకకొందఱు పండ్లలోఁ జిక్కుకొనుచు. ౨౭

పాఱుచుండెడి నదులప్రవాహ మెట్లు
సంద్రమున కెట్టయెదురుగాఁ జాలువాఱు
నట్లె యీలోకము వీరు లంద ఱిప్పుడె
పడుచు నున్నారు మండు నీవదనములను. ౨౮

బాగుగా మండు మంటలోఁ ద్వరితగతివి
మిడత లెటు నాశనముకై పడుచునుండు

నట్టులే నాశనమున కయి ప్రాణు లెల్లఁ
బడుచు నుండెను వేగ నీవదనములను. ౨౯

మండుముఖములతోడ బ్రహ్మాండములను
నన్నిటిని నెల్ల మెద మ్రింగి నాకుచుంటి
వోమహావిష్ణు! యీసర్వ భువనములను
తేజముల నింపి నీయుగ్రదీప్తి గాల్చు. ౩౦

భయద రూపంబు దాల్చి యెవ్వఁడవొ తెలుపు
నుతు లివిగో నీకు దేవ! యనుగ్రహింపు
మాద్య! వి న్నెఱుంగఁ దలంతు నయ్య నేను
నీప్రవర్తన మెట్టిదో నే నెఱుంగ. ౩౧

వ. శ్రీ భగవానుఁ డనియె.

జగములను జంపి వర్ధిల్లు సమయ మేను
భువనముల సంహరింపఁగఁ బూనుకొంటి
నెదిరి పక్షమందలి యోధు లెల్లఁ గూడ
నుర్వి నీవు లేకున్నను నుండ రిచట. ౩౨

కాన లెమ్మింకఁ గీర్తిని గాంచు మోయి
యరులఁ గెల్చి సుస్థిరరాజ్య మనుభవింపు
సర్వు లిట మున్నె నాచేతఁ జంపఁ బడిరి
యర్జున! నిమిత్త మాత్రంబ వగుమి యందు. ౩౩

ద్రోణుఁడును భీష్ముఁడు జయద్రథుండు కర్ణుఁ
డింకఁ గల యుద్ధవీరుల నెల్లఁ గూడ
నేను జంపినవారినే నీవు చంపు
వగవకుము పోరుము జయింతు వనిని రిపుల. ౩౪

వ. సంజయుఁ డనియె.

అంతఁ గృష్ణుని యీపలుక్కు లాలకించి
యంజలి ఘటించి వణఁకుచు నర్జునుండు
మ్రొక్కి మాటిమాటికి భయ మొందుచుండి
నమ్రుఁడై గద్గదధ్వనిఁ బలికెఁ గృష్ణు. ౩౫

వ. అర్జునుం డనియె.

బాగు! కృష్ణ! నీమాహాత్మ్య వర్ణనమున
భువన మానంద మొంది ప్రేముడివి మున్గు

భయముతో రాక్షసులు దిశల్ పాఱుచుండి
రొగిని సిద్ధసంఘము మ్రొక్కుచుండి రిదిగో. ౩౬
ఏల మ్రొక్కరు నిను వారలిట మహాత్మ!
ఆదికర్తయౌ బ్రహ్మను నతిశయింతెవు
ఘన! యనంత! దేవేశ! జగన్నివాస!
సత్తసత్తుల దాటు నక్షరుఁడ వీవు. ౩౭

వివ:—సత్తు = ఉన్నది అసత్తు = లేనిది

మొదటి దేవుఁడవు పురాణ పూరుషుఁడవు
సకల మగునీజగతికి నాశ్రయము వీవు
జ్ఞానివియు జ్ఞేయమవు పరంధాముఁడవును
నఖిలమునునిండె నీచే ననంతరూప! ౩౮

వివ:—జ్ఞానివి = తెలిసికొనువాఁడవు. జ్ఞేయమవు = తెలిసికొనఁదగినవాఁడవు.

వాయువు యముండ నగ్నివి వరుణుఁడవును
సోముఁడు ప్రజాపతివి ప్రపితామహుఁడవు
వందనము నీకు వేనవేల్ వందనములు
వందనము నీకు మఱిమఱి వందనములు. ౩౯

వందనము ముందుప్రక్కకు, వందనంబు
వెనుక, వందన మెల్లెడ విశ్వరూప!
ఓయనంతవిక్రమ! యమితోరుబలుఁడ
వంతయును నిండితివి సర్వ మైతి వనఘ! ౪౦

నీదు మాహాత్మ్య మెఱుఁగని నేను నిన్ను
యదుకుమార! యోమిత్ర! కృష్ణా! యటంచు
ప్రణయమునఁ గాని పొరపాటువలనఁగాని
సఖుఁడ వని యెంచి యెదియంటి సాహసమున. ౪౧

పండుకొనుచుఁ దిరుగుచుఁ గూర్చుండి తినుచు
నెదుటఁ గాని చాటునఁ గాని యేది నవ్వు
లాటకుఁ దిరస్కరించుచు నంటి నదియుఁ
గూడ నిన్నమేయ క్షమింప వేడికొందు. ౪౨

ఈ చరాచర జగమున కీవె పితవు
దీనికిం బూజ్యుఁ డుత్తముఁ డైన గురుఁడ
వెనయ నీకుఁ దుల్యుఁడు గాని ఘనుఁడు గాని
మఱి జగాల లేఁ డెటుండు నిరుపమాన! ౪౩

అందుచే భక్తి మ్రొక్కి సాష్టాంగముపడి
యీశ, నిను, స్తుత్యు దయఁ గల్గఁ జేసికొందు
జనకుఁడు సుతున్ బలె, సఖుండు సఖునిబోలెఁ
బ్రియుఁడు బ్రియుఁ దట్లు దేవ! సైరింపఁ దగుదు. ౪౪

మును గనని రూపు గని మోద మొందినాఁడ
భయముచేఁ గూడ వ్యాకులం బయ్యె మనసు
రూప మామున్నటిదె దేవ! చూప వయ్య
నన్ను దయఁ జూడు మీశ! జగన్నివాస! ౪౫

గద కిరీటము చక్రంబు గలుగు నిన్నె
చూడఁ గా వలె నని కోరు చుంటి నయ్య!
వేల బాహులు గలవాఁడ! విశ్వమూర్తి!
తిరుగ నానాల్గు చేతుల నయుఁడ వగుము. ౪౬

వ. శ్రీ భగవానుఁ డనియె.

ఇటు ప్రసన్నుఁడ నైన నే నిప్పుడె నీకు
నాత్మయోగానఁ జూపితి నాదు తొంటి,

విభువు. తేజోమయ. మనంతవిశ్వరూప:
మింతవఱ కెవ్వ రిది చూడ రీవు తక్క. ౪౭

వేద, దాన, యజ్ఞాధ్యయనాదిచేతఁ
గావి, యుగ్రతపములచేఁ గావి, క్రియల
చేతఁగావి యుర్విఁ ద్వదన్యచేత నిట్టి
రూపు గల నేఁ గనఁబడ నోకురుప్రవీర। ౪౮

క్రూర మగు నిట్టి నారూప మరసి
మోహము. వ్యథ నీవొందక పోదు వింక
భయము వీడి యానందభావంబుతోడ
మరల నెప్పటి నారూపె యరయు మిదిగో. ౪౯

వ. సంజయుఁ డనియె.

వాసుదేవుఁ డట్టులె యని పార్థుఁ బలికి
చూపె మరలఁ దనదు పూర్వరూప మపుడు
ఆమహాత్ముఁడు సౌమ్యదేహంబు పూని
యులికి వణఁకెడు నర్జును నూరడించె. ౫౦

వ. అర్జునుఁ డనియె.

సౌమ్యం బౌనీదు మానవ, దేహంబు చూచి మాధవా।
యిప్పుడు గద స్వాస్థ్యంబు, గాంచి నానైజ మొందితిన్.

వ. శ్రీభగవానుఁ డనియె.

ఎట్లుగా జూడఁగరాని యీ, నాదు రూపము గాంచితి
వీయాపు దేవతల్ గూడఁ, జూడఁ గోరెద రెప్పుడున్. ౫౨

వేదాలచేఁ దపసుచే, దానంబుచేత విష్టిచే
విట్టి నేను గనఁగారాను, నీవిప్డు చూచినట్లుగా. ౫౩

అనన్య భక్తి చేతనె, సరిగా నీదృశున్ ననున్
దెలియఁ జూడఁ జేరఁగ, శక్యంబు సుమ్మి ఫల్గునా। ౫౪

నాకర్మల్ చేసి నన్నమ్మి, నాభక్తిన్ గోర్కె లేకయే
సర్వప్రాణులఁ బ్రేమించు, వాఁడు నన్బొందు నర్జునా। ౫౫

ఇది శ్రీ..............గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగుగీతయందు విశ్వరూప దర్శన యోగ మను
ఏ కా ద శో ఽ ధ్యా య ము.

# తెలుఁగు గీత

## పండ్రెండవ యధ్యాయము

## భక్తి యోగము

వ. అర్జునుం డనియె.

ఇట్లెప్డు నిర్మలాత్ములై, యవ్యక్తు నిన్ను నక్షరు
నుపాసించెడు భక్తులం, దెవ్వరు యోగిసత్తముల్. ౧

వ. శ్రీభగవానుఁ డనియె.

నాయందుఁ జిత్తము న్నిల్పి, నిత్యంబు నిర్మలాత్ములై
యత్యంత శ్రద్ధతోఁ గొల్చు, వారలే యోగిసత్తముల్. ౨

ఇట్టి దనంగఁ, జింతింప, రాని యవ్యక్తు సర్వగున్
స్థిరుఁ, నిశ్చలుఁ గూటస్థు, నక్షరున్ వేయ గొల్తురే. ౩

వివ:—అవ్యక్తుని = జాతి గుణక్రియారహితుని. కూటస్థుఁడు = కూట మనఁగా సబద్ధములేక మాయ. అందు స్థ = ఉన్నవాఁడు. త్రాటి యందు పాముగుణములు వలె మాయాప్రపంచమునందు అధ్యాస రూపముగా ఉన్నవాఁడు బ్రహ్మము.

వా రింద్రియంబులం గెల్చి, యెల్లెడ సమబుద్ధులై
సర్వప్రాణులకున్ మేలు, గోరుచున్ నన్నె గాంతురు. ౪

కాని యవ్యక్తమును గోరు, వారి కెక్కువ కష్టమౌ
దేహాభిమానవంతుల, కవ్యక్తగతి కష్టమే. ౫

వివ :— అవ్యక్తమును = నిర్గుణబ్రహ్మమును, దేహాభిమానమును విడిచినఁగాని పరబ్రహ్మము పొంది శక్యముగాదు కావున దేహాభిమానము గలవారికి నిర్గుణబ్రహ్మమును బొందుట కష్టమనిభావము.

సర్వకర్మలు నాయందె, యర్పించి నన్నె గోరుచున్
అనన్య శ్రద్ధ నెవ్వారు, ధ్యానించుచును గొల్తురో. ౬

వారిని మృత్యుసంసార, వార్ధిం దరింపఁ జేయుదున్
నాపైఁ జిత్త ముంచువారి, కాలసింపను ఫల్గునా! ౭

నాయందె చిత్త ముంచుము, నాయందె బుద్ధి నిల్పుమీ
నాయందె యుందు విటపై, సందియమేమి లేదిటన్. ౮

మరి నాయందుఁ జిత్తంబు, గట్టిగ నిల్ప లేనిచో
అభ్యాసయుక్తిచే నైన, నన్నొందఁ గోరుమర్జునా! ౯

అభ్యాసశక్తి లేనిచో, నాకర్మ చేయఁ గోయుమీ
నాకోసంబును గర్మలు, చేసినన్ సిద్ధి గల్గున్. ౧౦

అదియుం జేయ లేనిచో, నాభక్తి నాశ్రయించియున్
ఫలేచ్ఛ వీడి చేయుము, కర్మల్ జితేంద్రియుండవై ౧౧

జ్ఞాన మభ్యాసముకన్న మించు, ధ్యానంబుమించు జ్ఞానమున్
దానిన్ మించు ఫలత్యాగ, మద్దానివెంట శాంతియౌ ౧౨

వివ:— ఇంతవఱకు అభ్యాసాదులను జెప్పి యింక నిందుఁ గర్మ
ఫలత్యాగ మహిమ యెంతటిదో ప్రశంసింపఁబడెను.

ఏప్రాణుల ద్వేషింపక, స్నేహంబు దయ గల్గియున్
మమత్వాహంకృతుల్ వీడి, సుఖదుఃఖాలఁ దుల్యులై. ౧౩

వివ:—మమత్వము = ఇది నాదియను భావము అహంకృతి =
నేనింత గొప్పవాఁడ ననుభావము.

తుష్టులై యెప్డు యుక్తులై, వశులై స్థిరబుద్ధులై
మనోబుద్ధుల్ నాకర్పించు, భక్తుల్ నాకుఁ బ్రియుల్ సుమీ.

లోకంబు తమవల్లఁ దా, మద్దానివల్లఁ గుండక
హర్షచింతల్ వెతన్ గిన్కన్, వీడు వారలె మత్ప్రియుల్.

దుఃఖేచ్ఛల్ వీడి శుచులై, సమర్థులై తటస్థులై
కర్మ ఫలంబులన్ వీడు, భక్తుల్ నాకుఁ బ్రియుల్ సుమీ.

హర్షింపక ద్వేషింపక, శుచింపక, కోర్కె లూనక
శుభాశుభ ఫలంబులు, వీడుభక్తులె మత్ప్రియుల్. ౧౭

శత్రుమిత్రుల మానావ, మానాల సమ బుద్ధులై
శీతోష్ణ సుఖదుఃఖాల, సములై సంగశూన్యులై. ౧౮

నిందాస్తుతులఁ దుల్యులై, తుష్టులై యున్నదానితో
ఇల్లును లేని మౌనులౌ, స్థిరుల్ భక్తులె మత్ప్రియుల్ ౧౯

శ్రద్ధాళులై నన్ను నమ్మి, నేఁజెప్పు ధర్మయుక్తమౌ
నీ యమృత ముపాసించు, భక్తులె నా కతిప్రియుల్. ౨౦

ఇది శ్రీ.....................గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగుగీతయందు భక్తి యోగ మను
పండ్రెండవ యధ్యాయము.

# తెలుగు గీత

## పదుమూఁడవ యధ్యాయము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

వ. శ్రీభగవానుఁ డనియె.

అర్జున! యీశరీరంబు, క్షేత్రం బని యనంబడుఁగా
ఈక్షేత్రం బెఱుఁగువానిన్, క్షేత్రజ్ఞుఁ డంద్రు తద్విదుల్. ౧

సర్వక్షేత్రంబులఁగా నన్ను. క్షేత్రజ్ఞుఁగ నెఱుంగుమి
ఆక్షేత్రంబును క్షేత్రజ్ఞు, నెఱుంగుటయె జ్ఞానమౌ. ౨

క్షేత్రమేదొ, యెట్టిదో, యే, మార్పొందు; దాన నే మగున్
క్షేత్రజ్ఞుఁ డే ప్రభావుఁడో, సంగ్రహంబుగఁ జెప్పెదన్. ౩

ఋషులచేత, వేర్వేఱు, ఛందాల, స్థిరయుక్తులన్
బ్రహ్మసూత్రంపుసూక్తులఁ, బల్గతిన్ జెప్పఁగాఁ బడెఁగా. ౪

పంచభూతాలు, తన్మాత్రల్, జ్ఞాన కర్మేంద్రియంబులుఁగా
బుద్ధ్యహంకారచిత్తంబు, లవ్యక్త మివి తత్త్వముల్. ౫

వివ:—తన్మాత్రలు = శబ్ద స్పర్శ రూప రస గంధములు.

ద్వేషేచ్ఛల్ సుఖదుఃఖంబుల్, సంఘాత చేతనా ధృతుల్
మార్పొందు నివ్వి క్షేత్రము. నాఁబడు సంగ్రహంబుగన్ ౬

వివ:— సంఘాతము = దేహేంద్రియముల సంఘాతము.

నిర్మమత, వినయంబు, నహింస, ఋజుతా క్షమల్
గురుపూజయు, శౌచంబు, మనోజయంబు, స్థైర్యముఁ. ౭

విషయంబుల వైరాగ్య, మహంకారంబు వీడుట;
జన్మన్ మృతిన్, జరన్, వ్యాధిన్, బాధన్ దోషముగాంచుట.

అనాసక్తియు, స్త్రీపుత్ర, గృహాదుల విరక్తియున్
ఇష్టానిష్టాది వస్తులం, దెప్పుడు సమచిత్తముఁ. ౯

అనన్య శ్రద్ధతో నన్ను, విడనాడని భక్తియున్
ఏకాంతస్థలసేవయు, నప్రీతి జన గోష్ఠులన్. ౧౦

అధ్యాత్మజ్ఞాననిత్యత, తత్త్వజ్ఞానార్థదృష్టియుఁ
ఇవే జ్ఞానంబు నాఁబడు, నజ్ఞాన మేత దన్యమౌ. ౧౧

జ్ఞేయం బేదో వచించెద, దాని నెఱుంగ ముక్తియౌ
అ దనాది, పరబ్రహ్మ, సత్తు, నసత్తుఁగా దది. ౧౨

చెవుల్ కన్నులు తలల్ మోముల్. కాల్సేతు లన్నివైపులన్
గలదై యది లోకంబు. లన్నిటిన్ గప్పి వర్తిలున్. ౧౩

సర్వేంద్రియగుణం బయ్యు. నింద్రియంబులు లేనిది
కోర్కె లేక యెల్లఁ దాల్చు, గుణియై నిర్గుణం బగున్. ౧౪

భూతంబులఁ బయిన్ లోనన్. చరమై యచరంబునై
సూక్ష్మం బౌట గనన్ రాక, యుండు దవ్వుల దగ్గరన్. ౧౫

భూతాళి నేక మయ్యును, విడియై నట్లు లుండును
ప్రాణులం బెంచి చంపుచుఁ, బుట్టించు; నదె జ్ఞేయము. ౧౬

అది జ్యోతులకున్ జ్యోతి, మనస్సున్ దాటి వర్తిలున్
జ్ఞేయంబున్ జ్ఞానమున్ గమ్య. మదుండు నెల్లప్రాణులన్.
క్షేత్ర జ్ఞాన జ్ఞేయములన్. సంగ్రహంబుగఁ జెప్పితిన్
సాధకుం డివి తెలిసి, నాతో నైక్యము నొందును. ౧౮

ప్రకృతి పురుషు లిద్దఱు, ననాదులం దెలియుఁగుమీ.
వికారంబుల్ గుణంబులు, బుట్టెన్ బ్రకృతివల్లనే. ౧౯

కార్యకారణముల్ మాఱ, నాప్రకృతియె హేతువు
సుఖదుఃఖంబులెల్లకు, నాపురుషుండె భోక్తయా. ౨౦

ప్రకృతిఁ బురుషుండుంటఁ, భుజించుఁ దద్గుణంబులన్
వివేకిన్ గుణసంగంబు, సదసజ్జన్మహేతువౌ. ౨౧

వివ:— సదసజ్జన్మహేతువు = మంచిచెడ్డ జన్మలకుఁ గారకుఁడు.

సాక్షియై మోదకుండయి, భర్తయు భోక్త యౌచునై
పరమాత్మ నా నీమేనఁ, బరుఁడై పురుషుం డగున్. ౨౨

ఈ ప్రకృతిపురుషుల, నిట్లు తెలియంగువారలు
ఎల్లరీతిన్ గుణాళితో, నుండియుఁ బుట్టఁ బోవరు ౨౩

సాంఖ్యయోగానఁ గొందఱు, కర్మయోగానఁ గొందఱున్
ధ్యానానఁ గొంద; ఱాత్మచేఁ, గొందఱు గాంతు రాత్మమున్.
కొంద ఱిట్లు తెలియంగక, కొల్తు రన్యులచే విని
విన్నదానిని నమ్మిన, వారిఁ దరింత్రు మృత్యువున్. ౨౫

జగతిం బుట్టుజంగమ, స్థావరంబులు సర్వమున్
క్షేత్రక్షేత్రజ్ఞసంసక్తిఁ బుట్టు నంచు నెఱుంగుమీ. ౨౬

సర్వభూతసముండౌచు, భూతంబులు నశించినన్
నశింపకుండు సర్వేశుఁ, జూచు మర్త్యుఁడె చూచును. ౨౭

ఎల్లెడన్ దుల్యుఁడై యుండు, నీశున్ సమంబ చూచువాఁ
డాత్మచే నాత్మఁ జంపఁడు, కానఁ బొందును సద్గతిన్. ౨౮

ప్రకృతే యెల్లెడన్ గర్తల్, గావించుఁ గావి యాత్మయో
కర్తమాత్రము గాదంచు, జూచు మర్త్యుఁడె చూచును. ౨౯

భూతంబు లెల్ల వేర్వేఱు, నొక్క యాత్మను నుంటయున్
అవెల్ల నాత్మవే నౌటఁ, జూచు మర్త్యుఁడె చూచును. ౩౦

గుణంబుల్ మొదలుఁ లేమి, నీయాఱుఁ దవ్యయుం డగున్
మేన నుండియుఁ జేయఁడు, నంటఁ బడఁడు కర్మచే. ౩౧

సూక్ష్మమై యుంట, వ్యాపియౌ, నాకాశ మంట రానటుల్
ఎల్లెడ నున్న యీయాత్మ, యంటఁబడదు మేనిచే. ౩౨

సూర్యుఁ డొక్కండె యీలోక, మెల్లన్ వెల్గించురీతిగా
ఈక్షేత్ర మెల్ల క్షేత్రజ్ఞుఁ, డొండె వెల్గించు నరునా. ౩౩

జ్ఞాననేత్రంబుచే నిట్లు, క్షేత్రక్షేత్రజ్ఞభేదముఁ
భూతమాయను దాటుటన్, దెల్సి గాంత్రు జనుల్ పరుఁ.

ఇది శ్రీ..................గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగుగీతయందు క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగ మను
పదుమూఁడవ యధ్యాయము.

# తెలుగు గీత



## పదునాల్గవ యధ్యాయము

## గుణత్రయ విభాగ యోగము.

వ. శ్రీభగవానుఁ డనియె.

జ్ఞానంబులందు శ్రేష్ఠమౌ, బ్రహ్మజ్ఞానము చెప్పెదన్
దానిం దెల్సి మును లెల్ల, సిద్ధిం గాంచి రుద్గతిన్. ౧

ఈజ్ఞాన మాశ్రయించియే, పొందిరి నాదు రూపముఁ
సృష్టియందును బుట్టరు, బాపరు ప్రళయంబునన్. ౨

మహత్తు బ్రహ్మయు నైన, నామాయ భూతహేతువు
అందు బీజంబు నాటెద, నందుండి భూతసృష్టి యౌ. ౩

సర్వయోనులయం దెట్టి, రూపము లుద్భవించునో
దాని యోని మహద్బ్రహ్మ, నే బీజ మొసఁగు తండ్రిని. ౪

సత్త్వ రజస్తమంబులు, ప్రకృతివల్లఁ బుట్టును
అవ్యయం బగునాత్మను, నవ్వి బంధించు మేనిలో. ౫

నిర్మలం బౌట సత్త్వంబు, ప్రకాశక, మబాధమున్
జ్ఞానాసక్తిన్ సుఖాసక్తి, నది బంధించు నాత్మను. ౬

రజస్సు రాగరూపంబై, తృష్ణాసక్తిదంబగున్
కర్మసంగముచే నద్ది, యాత్మఁగా బంధించు నర్జునా ।   ౭
వివ:—అప్రాప్తవస్తు తృష్ణ, దొరకినదానిపోఁగా రక్షించుకోర్కి ఆసక్తి.
తమ స్సజ్ఞాన జన్యంబు, మోహపెట్టును దేహులన్
ప్రమాదాలస్య నిద్రల, నది బంధించు నాత్మను.   ౮
సత్త్వంబు సుఖముం గూర్చు, రజస్సు చేర్చుఁ గర్మలో
తమస్సు జ్ఞానమున్ గప్పి, ప్రమాదంబునఁ జేర్చును.   ౯
రజస్సున్ దమమున్ గెల్చి, సత్త్వంబు మీఱు; సత్త్వముఁ
తమస్సున్ మీఱు రజస్సు; తమ స్సారెంటి గెల్చును.   ౧౦
ఈ మేన నెల్లద్వారాలఁ బ్రకాశ ముదయించును
అదే జ్ఞాన; మదే పుట్టు, సత్త్వంబు హెచ్చు టెఱుఁగుము.   ౧౧
రజోగుణంబు వర్ధిల్ల, లోభంబును బ్రవృత్తియున్
కర్మారంభము, నశాంతి, స్పృహయున్ గల్గు నర్జునా ।   ౧౨
తమోగుణంబు వర్ధిల్ల, నవివేకము మోహమున్
కర్మలం దప్రవృత్తియుఁ, బ్రమాద మౌను ఫల్గునా ।   ౧౩
సత్త్వగుణంబు వర్ధిల్ల, మరణ మొందు ప్రాణియో
యుత్తమతత్త్వవేత్తల, స్వచ్ఛలోకంబులన్ గను.   ౧౪

రజస్సు వర్ధిల్లిన్ బోయి, కర్మాసక్తులం బుట్టును
అట్లే తమోగుణమున్నుండు. మూఢజన్మలం బుట్టును. ౧౫

పుణ్యసాత్త్వికకర్మకు, శుద్ధసాత్త్వికఫలం బగున్
రజఃఫలంబౌ దుఃఖంబౌ, నజ్ఞానమె తమస్సుకున్ ౧౬

సత్త్వంబుచేత జ్ఞానంబౌ, రజస్సుచేత లోభమౌ
తమస్సుచేఁ బ్రమాదంబున్, మోహాజ్ఞానము లయ్యెడిన్.

సాత్త్వికుల్ పైకిఁ బోదురు, మధ్య నుందురు రాజసుల్
నీచగుణస్వభావులై, తామసు లుందురు క్రిందనే. ౧౮

వివ:— సాత్త్వికులు సత్యలోకమునందుగల దేవలోకమున దేవ
జన్మలను, రాజసులు పుణ్యపాపమిశ్రిత భూలోకములో మను
ష్యజన్మలను, తామసులు పశ్వాదిజన్మలను పొందెదరని భావము.

గుణాళికంటె వేరొండు, కర్త లేడు; గుణాళికిన్
నేఁ బయిం దనని గాంచు, ద్రష్ట నాయైక్య మొందును. ౧౯

ఈదేహహేతులౌ మూఁడు, గుణంబుల్ దాటి దేహియౌ
జన్మ, మృత్యు, జరా, దుఃఖ, ముక్తుఁడై మోక్ష మొందును.

అ. అర్జునుఁ డనియె.

త్రిగుణాతీతుని నెట్టి, చిహ్నాల నెఱుఁగందగున్
తత్ప్రవర్తన మెట్టిది, దాటు నెట్లీగుణంబులన్. ౨౧

వ. శ్రీభగవానుఁ డనియె.

ప్రకాశంబు ప్రవృత్తియు, మోహంబును బ్రవర్తిలఁగా
వానిద్వేషంబుఁ దవ్వియు, మఱిపోవఁగఁ గోరఁడు. ౨౨

వివ:— సత్త్వగుణకార్యమగు ప్రకాశమును, రజోగుణకార్యమగు ప్రవృత్తియు తమోగుణకార్యమగు మోహమును, బ్రవర్తింపఁగా వానిని అతిశయించినవానిని గుణాతీతుఁడందురని భావము.

తటస్థువలెఁ గూర్చుండు, గుణాళిచేఁ జలింపఁడు
గుణంబులే ప్రవర్తించు, నని యుండుఁ జలింపక. ౨౩

కష్టసుఖాల్ స్తుతినిందల్, ప్రియాప్రియంబులన్ ధృతిన్
బెడ్డయుఁ రాళ్లు, బంగారు, సమతన్ జూచి తుష్టుఁడౌ. ౨౪

శత్రుమిత్రుల మానావ, మానాల సమదృష్టియై
సర్వకర్మల్ విడువాఁడు, గుణాతీతుఁ డనంబడున్. ౨౫

నన్నెవ్వఁ డెప్డు విడని, భక్తితో సేవ చేయునో
వాఁ డీగుణంబులన్ దాటి, బ్రహ్మతో నైక్య మొందును ౨౬

నాశ మొందక, మాఱక, శాశ్వత ధర్మ రూపమై
నిత్యానంద స్వరూపంబౌ, బ్రహ్మకు నేనె మూలము. ౨౭

ఇది శ్రీ............గణపతిశాస్త్రిచేఁ దెనుఁగింపఁబడిన
తెనుఁగుగీతయందు గుణత్రయ విభాగ యోగమను
పదునాల్గవ యధ్యాయము.

# తెనుఁగు గీత

## పదునేనవ యధ్యాయము

## పురుషోత్తమ యోగము

వ. శ్రీభగవానుఁ డనియె.

పైని వేరు కొమ్మలు క్రిందఁ బర్వి యాది
యంతమునులేని యశ్వత్థమండ్రు దీని
దానియాకుల్ ఋుగాదిఛందస్సు లగును
దానిఁ దెలిసినవాఁడు వేదార్థవిదుఁడు. ౧

వివ:—పైని = అన్నిటికి పైనున్న యుత్కృష్టమైన బ్రహ్మమును. కొమ్మలు = కొమ్మలవంటి మహదహంకార తన్మాత్రాదులను శ్వః = రేపు. స్థము = ఉన్నది. అశ్వత్థము = రేపు లేనిది సంసారము. రావిచెట్టును. ఇక్కడ సంసారము రావిచెట్టుతోఁ బోల్పఁ బడినది.

గుణములఁ బెరిగి విషయంబు లనెడిచివురు
దొడిగి, కొమ్మల్ పయిని గ్రింద నలముకొనియె
కర్మములఁ బట్టి మర్త్యలోకమున దాని
మూలము లెడతెగక లోన వేళ్లు లూనె. ౨

ఇం దటులు దీని రూపు గన్పింపకుండె
దీని కాది మధ్యము నంత మేని లేవు
పాతుకొని రాని వ్రేళ్ళ యశ్వత్థ మిద్ది
గట్టి దైన నిష్కామమ ఖడ్గమున నఱకి. ౩

ఈ సనాతన సంసార వృక్షగతులఁ
బరపు నయ్యాదిపురుషుని శరణుఁ జొత్తు
మని తలఁచి యెందు చని మఱి మరలిరారొ
యా పదంబె యన్వేషింప నర్హ మింక. ౪

మమత మోహంబు సంగము జా మానువారు
ఆత్మనిత్యులు నిష్కాము లైనవారు
కష్టసుఖము లాదిగ జంట గనని వారు
అజడులును గాంతు రట్టి యవ్యయ పదంబు ౫

విశ :— అజడులు = జడులు కాని జ్ఞానులు.

వెల్గింపఁ దది సూర్యుండు, వెల్గింప రగ్నిచంద్రులున్
దేనిన్ బొంది యిఁకన్ రారో, యదే నా పరంధామము. ౬

పూర్వుఁడై జీవుఁడం దుండు, జీవుఁడు నా యంశమే
ప్రకృతి నున్న యింద్రియ, మనస్సుల్ వాఁడె లాగును. ౭

ఎప్పు డీశుండు పైకేగు, నెప్డు మేను గ్రహించునో
యప్పు డవి దాల్చి యేగున్, బూ(దావిఁ గాలిపోలికన్. ౮
వివ :— అవి = ఆయింద్రియములను మనస్సును.

చెవులన్ గన్నులఁ దాన్వ్రక్కుఁ, నాల్కను ముక్కుఁ దాల్చియే
యీ దేహమందు మనస్సు సేవించు విషయంబులఁ. ౯

మేను విడుచు విర్చుచు. దించు, గుణాళిఁ దాల్చుచున్
మించునీశున్ గన రజ్ఞుల్, గాంత్రు విజ్ఞానచక్షువుల్ ౧౦

యత్నించి నిశ్చలుల్ యోగుల్, గాంతు రాత్మస్థు నీశ్వరున్
అసంస్కృతాత్ము లామోఘుల్, గాంచరు యత్నమూనియున్.

ఎల్లలోకంబు వెల్గించు, నేతేజ మ్మదె సూర్యులో
చంద్రునం దేది, యే దగ్ని, నదె నాదవి యెంచుమీ. ౧౨

పృథివిం జొచ్చి భూతంబుల్, ధరింతు నాదు తేజచే
రసాత్ముఁడై చంద్రుఁడనై, పెంచెద నెల్ల యోషధుల్. ౧౩

అగ్నిహోత్రుఁడనై నేను, ప్రాణుల మేను జొచ్చియే
ప్రాణాపానములం గూడి, పచింతు నాలు గన్నముల్. ౧౪

వివ :— ౧ భక్ష్యము = కొఱికితినునది. ౨ భోజ్యము = నాలుకచే చప్పరించునది ౩ లేహ్యము = నాకి మింగఁబడునది. ౪ చోష్యము = పీల్చఁబడునది. అవి యన్నములు నాలుగు విధములు.

ప్రాణు లన్నింటిహృది నుండువాఁడ నేను
భ్రమయు స్మృతియు జ్ఞానంబు నావల్లఁ గలిగె
పుడమిలో సర్వవేద్యుఁడను నేనె
నేనె వేదాంత కారుఁడన్ వేదవిదుఁడ ౧౫

క్షరుండు నక్షరుం డంచుఁ గల రిద్దఱు పూరుషుల్
క్షరుండౌ సర్వభూతంబుల్, కూటస్థుఁ డక్షరుం డగుఁ. ౧౬

వివ: — క్షరుఁడు = నశించువాఁడు. అక్షరుఁడు = నశింపనివాఁడు.

పరమాత్ముఁ డనంబడు, పురుషోత్తముఁ డన్యుఁడు
వాఁ డీలోకత్రయిం జొచ్చి, ప్రోచు, నవ్యయుఁ డీశుఁడై.

అక్షరుకన్న శ్రేష్ఠుండన్, క్షరాతీతుఁడఁ గావునన్
లోకవేదములన్ నన్నుఁ, బురుషోత్తముఁ డందురు. ౧౮

మూఢుండు గాక, నన్నిట్లు. పురుషోత్తము నెంచెడి
సర్వజ్ఞుఁ డెల్లరీతుల, నన్నే భజించు నర్జునా! ౧౯

ఇట్టి పరమగూఢమౌ, నీశాస్త్ర మేను జెప్పితిన్.
దీనిం దెలియు ధీశాలి, కృతకృత్యుండ యయ్యెడున్. ౨౦

ఇది శ్రీ.... .... .... ....గణపతి శాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగుగీతయందు పురుషోత్తమయోగమను
పదునేనవ యధ్యాయము.

# తెనుఁగుగీత

## పదునాఱవ యధ్యాయము

## దైవాసుర సంపద్విభాగయోగము.

క. శ్రీభగవానుఁ డనియె.

నిర్భీతి, చిత్తశుద్ధియు, జ్ఞానయోగాల నిష్ఠయున్
దానంబు, దమ తపంబుల్, స్వాధ్యా యార్జవ యజ్ఞముల్. ౧

వివ:— దానము = అన్నధనాదుల సరిగాఁ బంచుట, దమము = బహిరింద్రియ నిగ్రహము, తపము = శారీర, మానసిక, వాచిక నియమరూపతపస్సు. స్వాధ్యాయము = మోక్షశాస్త్రాధ్యయనము. ఆర్జవము = కుటిలస్వభావము లేకపోవుట. యజ్ఞము = అగ్నిహోత్రాదులను, ద్రవ్యయజ్ఞ, దేవయజ్ఞ, పితృయజ్ఞ, భూతయజ్ఞ, మనుష్యయజ్ఞాదులను

సత్యాహింసల్ శమ శాంతు, లపైశునంబు త్యాగముఁ
భూతదయ, యచాపల్య, మలౌల్య మార్దవ త్రపల్. ౨

వివ:— శమము = అంతరింద్రియ నిగ్రహము, అపైశునము = చాడీలు చెప్పక పోవుట, అచాపల్యము = గడ్డిపరక మొదలగు వానిని తీరక త్రుంచుట మొదలగు ప్రయోజనశూన్యమగు పనుల

చేయఁకపోవుట. అలోల్యము = విషయేంద్రియసంపర్కమును వికారము పొందకపోవుట. హ్రీః = అసత్కర్మములు చేయుటకు సిగ్గుపడుట.

అద్రోహంబున్ వినయంబున్, ధైర్య మోర్పు శుచిత్వముల్
ఈయవి దైవసంపద, గల్గువాఁ డౌను సద్గుణా! ౩

దంభంబు, స్వాభిమానంబు, పారుష్య క్రోధ గర్వముల్
అజ్ఞానం బివి యాసుర, సంపద గల్గువాని కౌ. ౪

ముక్తి కౌ దైవసంపద, యాసురి బంధకారియౌ
కుందకు దైవసంపద, గల్గువాఁడవు ఫల్గునా! ౫

దైవంబు నాసురం బని, భూతసృష్టులు రెండగున్
దైవంబు విస్తరించితి, విను మాసుర మర్జునా! ౬

ప్రవృత్తియు నివృత్తియు, నెఱుంగ రాసురుల్ జనుల్
ఆచార మేని శౌచం బేన్, సత్య మేఁ లేవు వారిలో. ౭

ఈలోకంబు నిరాధార, మసత్యంబు నిరీశ్వర
మిది యన్యోన్యకామేచ్ఛన్, జన్మించుఁగాక యే మిఁకన్. ౮

వివ:—నిరీశ్వరము = ఈశ్వరుఁడు లేనిది.

అంచు నీదృష్టితో నుండి, నష్టాత్మలై యల్పబుద్ధులై
క్రూరాత్ములై యహితులై, గావింత్రు లోకనాశమున్. ౯

నింపరాని కామ మూని, దంభాభిమానగర్వులై
మోహానఁ జెడు బూన్కితోఁ బోదు రశుచిదీక్షులై. ౧౦

భోగాలె పరమావధి, యింతే యని స్థిరాత్ములై
చావువాఁకఁ దా మస్తమింత్రు, మితి లేనట్టి చింతలఁ. ౧౧

ఆశాపాశాల బద్ధులై, కామ క్రోధ వశాత్ములై
భోగంబులకు నార్జింతు, రన్యాయంబుగ ద్రవ్యమున్. ౧౨

"సంపాదించితి నియ్యది, యీకోర్కె యింకఁ బొందెదన్
ఇది యున్నది, యీధనం, బింక రాఁగల దిప్పుడే. ౧౩

ఈ నాశత్రువుఁ జంపితి, నన్యులఁ గూడఁ జంపెదఁ
నేనీశ్వరుండ, నేభోగిఁ, సిద్ధుండన్ వీరుఁడఁ సుఖిన్. ౧౪

ధనాఢ్యుండఁ, గులీనుండ, నాసము లెవ్వ రీవిధిఁ
యజింతు నిత్తు హర్షింతు" నని భ్రమింతు రజ్ఞతఁ. ౧౫

బహుచిత్తభ్రమ లొందుచు, మోహజాలానఁ జిక్కుచున్
భోగాలం బడి కూలెద, రశౌచ నరకంబునన్. ౧౬

మన్నించుకొంచుఁ దమ్ముఁ దా, ముబ్బి ధనమదాంధులై
బడాయిఁ యజ్ఞముల్ పేరు, కొనరు రయథావిధిన్. ౧౭

గర్వాహంకార బలముల్, కామ క్రోధంబు లొందుచున్
స్వదేహ పరదేహాల, నన్ను ద్వేషింతు రీర్ష్యతో. ౧౮

సదాద్వేషించుచుఁ గ్రూరులై, యశుభులైన నీచులఁగా
సంసారంబున నాసురీ, యోనులం బెట్టఁ ద్రోయుదున్. ౧౯

ఆసురయోనులం బొంది, మూఢులు జన్మజన్మలో
నన్నొందక కింక నధమ, గతిన్ గాంతురు ఫల్గునా। ౨౦

వివ:—కాని ఇంకే నరకవ్యాధికిఁ జిక్కుయగు పుణ్యజ్ఞానాదుల
సంపాదింపక ఇంక ముందేలే నరకమునకుఁ బోయి దుఃఖితులై
ఏమిచేసిన లాభమేమి అని భావము.

కామము, క్రోధము లోభం, బను నీమూఁడు నాత్మను
నశింపఁ జేయు నరక, ద్వారంబుల్ వీని వీడుము. ౨౧

అజ్ఞాననరకద్వారా, లీమూఁటఁ బడ కుండువాఁ
డాత్మశ్రేయ స్సొంది యాపై, నుత్తమగతి గాంచును. ౨౨

శాస్త్రవిధిన్ విడి మోహం, దాశను లొంగి చేయునో
వాఁడు సిద్ధిని బొందఁడు, సద్గతిఁగా సౌఖ్య మొందఁడు. ౨౩

శాస్త్రం బది ప్రమాణంబు, కార్యాకార్యవివేచనఁగా
కాన శాస్త్రోక్తముం దెల్సి, కర్మలు చేయఁగాఁ దగున్. ౨౪

ఇది శ్రీ..................గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగుగీతయందు దైవాసుర సంపద్విభాగయోగమను
పదునారవ యధ్యాయము.

# తెనుఁగు గీత

## పదునేడవ యధ్యాయము

## శ్రద్ధాత్రయ విభాగయోగము

వ. అర్జునుం డనియె.

శాస్త్రవిధిన్ విడి శ్రద్ధన్, పెద్దలఁ గని గొల్చెడి
వారి దే శ్రద్ధ? సత్త్వమా, రజస్సా తమసా ప్రభూ ! ౧

వ. శ్రీభగవానుఁ డనియె.

స్వభావంబుగఁ బ్రాణులన్, శ్రద్ధ మూఁడు విధంబులు
సాత్త్వికి, రాజసి మఱి, తామసి యంద్రు వానిని ౨

మనస్సుం బట్టి శ్రద్ధయౌ, జీవుల్ శ్రద్ధామయుల్ గదా
ఎవ్వఁ డే శ్రద్ధ గలవాఁ, డాతండు నట్టివాఁడె యౌ. ౩

సాత్త్వికుల్ దేవులఁ గొల్తు, రక్షోయక్షుల రాజసుల్
భూతప్రేతగణంబులన్, యజింత్రు తామసుల్ జనుల్. ౪

శాస్త్రవిరుద్ధమౌ ఘోర, తపంబు చేయు యేనరుల్
దంభాహంకారముల్ పొంది, కామరాగాల మింతురో. ౫

వారు దేహస్థభూతాళిఁ, లోలోన నున్న యీననున్
కృశింపఁ జేతు రజ్ఞతన్, వార లాసురనిశ్చయుల్. ౬

జను లందఱ కాహార, యజ్ఞ దాన తపంబులున్
మూఁడు విధాల నిష్టంబుల్, వాని భేదంబు విన్మదే. ౭

ఆయు ర్వృద్ధి బలారోగ్య ప్రీతిదంబుల్ రసాఢ్యముల్
చమురౌ పుష్టియౌ, వింపౌ, నన్నంబుల్ సాత్త్వికంబులు.
వివ :—ప్రీతిదంబులు = ప్రీతినిచ్చునవి.

ఉప్పుఁ, గార, మతివేఁడి, పుల్పు, వెండువి చేదువి
దప్పిన్ వ్యాధిన్. వ్యథల్ గూర్చు, నన్నంబుల్ రాజసంబులు
వివ :—వ్యథలు = తాత్కాలికబాధ, తరువాతఁ గలుగు బాధయు.

చల్లఁబడ్డ, రుచిపోవు, దుర్గంధి యైన, రాత్రి దౌ
ఎంగిలౌ నపవిత్రంబౌ, నన్నంబుల్ తామసంబులు. ౧౦

యజింపవలె నవియే, మది నెంచి యథావిధిన్
ఫలేచ్ఛ లేక కావించు, యజ్ఞంబు సాత్త్వికం బగున్. ౧౧

ఉద్దేశించి ఫలం బేదౌ, యాడంబరముకోసమున్
జేయంబడెడియజ్ఞంబు, రాజసం బని యెంచుమీ. ౧౨

మంత్ర మే నన్నదానం బేఁగా, దక్షిణ యేని శ్రద్ధయేన్
లేక, శాస్త్రోక్త మేన్‌గాని, యజ్ఞంబు తామసం బగున్. ౧౩

దేవున్ ద్విజుఁ గురున్ బ్రాజ్ఞుఁ, గొల్చుట శుచిసౌమ్యతల్
అహింస, బ్రహ్మచర్యంబు, దేహతపస్సు నాఁబడున్. ౧౪

బాధ గూర్పని మాటయు, ప్రియహితంబు, సత్యముఁ
స్వాధ్యాయపాఠమేనియు, వాక్తప, స్సనఁగాఁ బడున్. ౧౫

వివ :— స్వాధ్యాయపాఠము = మోక్షశాస్త్రాధ్యయనము.

మనఃప్రశాంతి, సౌమ్యత, మౌన, మింద్రియనిగ్రహ
మమాయకత్వ మీయవి; మనస్తపస్సు నాఁబడున్. ౧౬

ఫలేచ్ఛ లేక యత్యంత, శ్రద్ధఁ మూఁడు తపస్సులన్
చేయు నిర్మలచిత్తుల, తపస్సు సాత్త్వికం బగుఁ. ౧౭

సత్కారాదుల కోసము, నాడంబరము కోసమున్
గావించు చంచలం బైన, తపస్సు రాజసం బగుఁ. ౧౮

మూర్ఖపుంబట్టుతోఁ దాను, బాధవొందుచు నన్యులన్
జంపుట కేని గావించు, తపస్సు తామసం బగున్. ౧౯

ఈయఁదగు నని దేశ, కాలపాత్ర లెఱింగియున్
అనుపకారి కిచ్చెడి, దానంబు సాత్త్వికం బగున్. ౨౦

ప్రత్యుపకార మాశించి, ఫలంబు గోరి యైనను
బాధపడి యొసంగెడి, దానంబు రాజసం బగుఁ. ౨౧

దేశకాలాలు చూడక, విందించి, యవమానమున్
జేసి, యపాత్రుల కిచ్చు, దానంబు తామసం బగున్. ౨౨
ఓ మంచు, తత్తు, సత్తంచు, బ్రహ్మంబు నంత్రు తద్విదుల్
దానన్ వేదాలు బ్రాహ్మణుల్, యజ్ఞంబుల్ పూర్వ మేర్పడెన్.
కావ "ఓం" అంచుఁ బల్కుచు, బ్రహ్మవాదుల్ యథావిధిన్
యజ్ఞ దాన తపః కర్మ, లాచరించెద రెప్పుడున్. ౨౪
ఫలంబు గోర కుండనె, త త్తంచుఁ బల్కి యెన్నియో
యజ్ఞ దాన తపఃకర్మ, లాచరింత్రు ముముక్షువుల్. ౨౫
మున్ను లేవిది యైనప్పు, చెడ్డది మంచి దౌతఱిన్
శుభకర్మంబు లైనప్పు, సత్తని యందు రర్జునా। ౨౬
యజ్ఞ దాన తపస్సుల, శ్రద్ధయె సత్తు నాఁబడున్
తత్కర్మ యీశ్వరార్థమున్, గాన వద్దియు సత్తె యౌ. ౨౭
హోమముల్ తపముల్ కర్మల్ దాన మశ్రద్ధఁ జేయుచో
అస త్తని యనంబడు, లేదందు ఫలం; బింధును. ౨౮

ఇది శ్రీ.... ........ ....గణపతి శాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగుగీతయందు శ్రద్ధాత్రయ విభాగయోగమను
పదునేడవ యధ్యాయము.

# తెనుఁగు గీత

## పదునెనిమిదవ యధ్యాయము

## మోక్షయోగము.

వ. అర్జునుఁ డనియె.

కృష్ణ ! సంన్యాసతత్త్వంబు, తెల్పికొనంగఁ గోరెదన్
అట్టులే త్యాగతత్త్వంబు, తెలియం జెప్పు మచ్యుతా ! ౧

వ. శ్రీభగవానుఁ డనియె.

కామ్యకర్మల వీడుట, సంన్యాస మంద్రు పండితుల్
సర్వకర్మఫలత్యాగ, మంద్రు త్యాగంబు నేర్పరుల్. ౨

దుష్టకర్మల్ విడవలె, నంద్రు కొందఱు ధీయుతుల్
యజ్ఞ దాన తపః కర్మల్, విడరా దందు రన్యులు. ౩

ఆత్యాగ విషయంబందు, నానిశ్చయంబు విన్మదే
త్యాగంబు త్రివిధం బౌచుఁ, జెప్పఁబడియె ఫల్గునా । ౪
యజ్ఞ దాన తపఃకర్మల్, వీడక చేయఁగాఁ దగుఁ
యజ్ఞ దాన తపస్సులు, పూత మొనర్చుఁ బ్రాజ్ఞులన్. ౫
ఈ కర్మలుఁ ఫలములు, నాసక్తి వీడి చేయఁగాఁ
దగిన వంచు శ్రేష్ఠమౌ, నానిశ్చితమతం బిదే. ౬
తప్పక చేయఁదగిన, కర్మల్ వీడఁగ రాదిలన్
అజ్ఞానంబున వానిని, వీడుట తామసం బగున్. ౭
కష్ట మంచుఁ గాయకష్ట, భీతితోఁ గర్మ వీడుచో
రాజసత్యాగమున్ జేసి; పొందఁడు త్యాగలాభముఁ ౮
చేయఁగావలయు ననుచుఁ, దప్పక కర్మ చేయుచున్
ఫలాసక్తుల వీడ నా, త్యాగంబు సాత్త్వికం బగున్. ౯
ప్రాజ్ఞుఁడై సత్త్వయుక్తుండై, సంశయం బుడ్గి త్యాగి తా
ద్వేషింపఁ డశుభకర్మల్, కాంక్షింపఁడు శుభంబులన్. ౧౦
కర్మల్ పూర్తిగ వీడుట, దేహధారి కశక్యము
కర్మఫలంబులన్ వీడు, వాఁడె త్యాగి యనంబడున్. ౧౧

అనిష్టేష్ట మిశ్ర మను, కర్మఫలాలు మూఁడును
అత్యాగుల్ చని గాంతురు, సంన్యాసుల్ గాంచ రెప్పుడున్ ౨౪
వివ:—అత్యాగులు = త్యాగులు కానివారు.                    దక
కర్మహా ద్వైన సాంఖ్యమం, దెల్ల కర్మల సిద్ధికై                  ౨౫
హేతు లైదు చెప్పఁబడెన్, విన్మ చెప్పెద ఫల్గునా !
వివ:—కర్మహద్దైన = కర్మమే చివరిహద్దుగాగల.                    ౬
శరీరంబును జీవుండు, వేఱు వే ఱింద్రియంబులున్
నానాచేష్టలు దైవంబున్, సిద్ధి క్రియైదు హేతువుల్.          ౧౪
అన్యాయ మేని న్యాయం బేన్, మనో వాక్కాయ కర్మలన్
నరుం డెయ్యది పూనునో, దాని క్రియైదు హేతువుల్.          ౧౫
ఇయ్యె దిట్లుండ నెవ్వఁడు, కేవలాత్మనె కర్తగాఁ
జూచునో బుద్ధిలేమిచే, వాదుర్బుద్ధి గనం డిలన్.          ౧౬
గర్వంబు లేని కుండదో, బద్ధంబు గాదో బుద్ధియున్
వాఁ డీలోకాలు చంపియుఁ, జంపఁడు, కాఁడు బద్ధుఁడుఁన్
జ్ఞానంబు జ్ఞేయముఁన్ జ్ఞాత, యీమూఁడు కర్మప్రేరణల్
కర్మ కర్త కరణంబు, లీమూఁడు కర్మవర్ధతుల్.          ౧౮

జ్ఞానంబు, కర్మ, కర్తయు, గుణాలఁబట్టి మూఁడె యౌ
సాంఖ్యశాస్త్రోక్త మియ్యది. యవ్వియున్ విన్మ చక్కఁగన్.

వేఱుగా నుండుభూతాళిన్, మార్పు వేఱును లేనియౌ
భావముం జూచుజ్ఞానంబు, సాత్త్విక మం చెఱుంగుమీ. ౨౦

వేఱుగా సర్వభూతాల, వేఱౌ ననేకభావముల్
చూచెడు నట్టి జ్ఞానంబు, రాజస మం చెఱుంగుమీ. ౨౧

అంతయు నొక్కకార్యమం, దున్నదౌ, హేతుశూన్యమౌ
స్వల్పమౌ, తత్త్వశూన్యంబౌ దానిన్ దామస మందురు. ౨౨

వివ:—ఈ సమస్తాత్మజ్ఞానము దేహకార్యమందుఁ గాని, ప్రతిమాది కార్యమందుఁ గాని మాత్రమే యున్నదనుట, చార్వాకాదులు ఆత్మ దేహమందే యున్నదని, దేహమే ఆత్మయని అనిత్యమని అల్పమని యందురు. ఇట్లు అంతయు తత్త్వవిరుద్ధముగఁ దలఁచుట తామస మందురని భావము.

నిత్యమై సంగశూన్యంబై, రాగద్వేషాలు లేనిదై
ఫలాపేక్ష లేక చేయు. కర్మము సాత్త్వికం బగున్. ౨౩

కర్మఫలేచ్ఛచేఁ గాని, యహంకారముచేత నేఁ
జేయు నత్యంతకష్టమౌ, కర్మంబు రాజసం బగుఁ. ౨౪

రాఁబోవు నష్టమున్, హింసఁ, స్వసామర్థ్యము చూడక
అజ్ఞానంబునఁ గావించు, కర్మంబు తామసం బగుఁ. ౨౫

ఇచ్ఛాహంకారముల్ లేక, ధైర్యోత్సాహ యుతుండునై
సిద్ధ్యసిద్ధుల మాఱని, కర్తయె సాత్త్వికుం డగున్. ౨౬

రాగంబు, కర్మఫలేచ్ఛ, హింస, లోభ, మశౌచమున్
హర్షమున్, శోకముఁ గల్గు, కర్తయె రాజసుం డగున్.

లోలుఁ, డజ్ఞుండు, స్తబ్ధుండు, మాయావి, దీర్ఘసూత్రియున్
దుఃఖి, సోమరి, భేదకుఁ, డౌ క ర తామసుం డగుఁ. ౨౮

బుద్ధియున్ ధృతియుం గూడ, గుణాలఁబట్టి మూఁడెయౌ
వేర్వేఱ వానిఁ బూర్తిగఁ, జెప్పెద విన్ము ఫల్గునా। ౨౯

ప్రవృత్తి నివృత్తుల్ కార్య, మకార్యంబు, భయాభయాల్
బంధ మోక్షంబు లెఱుంగు, బుద్ధి సాత్త్వికి నాఁబడుఁ. ౩౦

ధర్మంబును నధర్మంబున్, గార్యంబును నకార్యమున్
సరిగాఁ దెల్పకొనని, బుద్ధి రాజసి నాఁబడున్. ౩౧

ధర్మ మని, యధర్మంబున్, విరుద్ధంబుగ సర్వముఁ
అజ్ఞానంబున నెంచెడి, బుద్ధి తామసి నాఁబరఁగున్. ౩౨

ఎన్నండుఁ బోని ధృతితో, మనఃప్రాణేంద్రియక్రియల్
అత్యంతశ్రద్ధఁ దాల్చెడి, ధృతి సాత్త్వికి నాఁబరఁగున్. ౩౩

ధర్మ మర్థముఁ గామంబు, నాయాసక్తిఁ బట్టి యే
ఫలంబు గోరి ధరించు, ధృతి రాజసి నాఁబరఁగున్. ౩౪

కలయుం భయముం గాని, శోకంబు, నెవ్వ, గర్వమున్
వీడని, బుద్ధిహీనుని, ధృతి తామసి నాఁబరఁగున్. ౩౫

పార్థ! యింకన్ త్రివిధమౌ, సుఖంబు విన్ము చెప్పెదన్
దానిన్ నేర్చి సుఖింతువు, దుఃఖాంతమును గాంతువు. ౩౬

ఏది ముందట విషమై, ఫలింప నమృతంబునై
బుద్ధినైర్మల్యముం గూర్చు, సుఖంబు సాత్త్వికంబగున్. ౩౭

విషయేంద్రియసంసక్తి, నేది ముం దమృతంబె యై
ఫలింపఁగ విషంబౌ నా, సుఖంబు రాజసంబగున్. ౩౮

ముందున్ దర్వాత నాత్మను, మోహపెట్టును, నిద్రచే
మాంద్యాన భ్రాంతిచేఁ గల్గు, సుఖంబు తామసం బగున్. ౩౯

భువిం గాని, దివిం గానీ దేవులగా ప్రకృతిజన్యమౌ
నీమూఁడుగుణముల్ లేని, పదార్థం బుండ దెన్నఁడున్. ౪౦

బ్రాహ్మణక్షత్రియులకుగా, వైశ్యశూద్రుల కర్జునా।
స్వస్వభావగుణంబులఁ, గర్మలు విభజించితిగా. ౪౧

శమంబు దమమున్ దప, మాస్తిక్య మోర్పు శౌచముగా
జ్ఞాన విజ్ఞాన సౌమ్యతల్, బ్రాహ్మణు నైజకర్మలు. ౪౨

తేజ. శౌర్యంబు, ధైర్యంబు, పోరున వెన్ను చూపమి
దక్షత, దాన, మీశత, క్షత్రియు నైజకర్మలు. ౪౩

కృషి. వాణిజ్య. గోరక్షల్, వైశ్యుని నైజకర్మలు
శుశ్రూషారూప మౌకర్మ. శూద్రుని నైజకర్మయౌ. ౪౪

శ్రద్ధగా స్వకర్మలన్ జేయు. జనంబు సిద్ధిపొందును
స్వస్వకర్మపరు లెట్లు. సిద్ధి గాంతురో విన్మదే. ౪౫

వివ:—స్వస్వకర్మపరులు = స్వస్వవర్ణాశ్రమ విహితకర్మపరులని
పూర్వులు. స్వస్వభావనియతకర్మణి పరులని నవీనులు.

భూతంబు లెల్ల సృష్టించి, యందెల్ల నిండి యుండిన
యీశుగా స్వకర్మచేఁ గొల్వ. మర్త్యుండు సిద్ధి పొందును.

పరిగాఁ జేయఁబడిన, పరధర్మంబుకంటెను
విగుణంబుగఁ దోఁచియు, స్వధర్మ మదె శ్రేష్ఠము ౪౭(క)
తన స్వభావమునకుఁగా, నియతం బైన కర్మము
ఆచరించెడి జీవుండు, పాపంబు పొందఁ డెప్పుడున్. ౪౭(ఖ)
సహజం బైనకర్మలు, దుష్టంబు లయ్యు వీడరా
దగ్నిన్ బొగ గ్రమ్మినట్లు, దోషంబుల్ వెంటె నెల్లెడన్. ౪౮
ఎల్లెడన్ గోర్కె వర్జించి, వశియై వీతరాగుఁడై
సంన్యాసంబున శ్రేష్ఠమౌ, నైష్కర్మ్యసిద్ధి పొందును. ౪౯
జ్ఞానంపు నిష్ఠ యాసిద్ధిన్, బొంది బ్రహ్మంబు గాంచెడి
రీతి క్షత్రముగాఁ బార్థ!. వచియింతు నెఱుంగుమీ. ౫౦
నిర్మలంబుద్ధితోఁ గూడి, ధృతితో మేను గెల్చియున్
శబ్దాదిభోగముల్ వీడి, రాగద్వేషము లంటక. ౫౧
మనోవాక్కాయముల్ నిల్పి, యొంటియై మితభోజియై
ధ్యానయోగమునం దెప్డుఁ, దుండి వైరాగ్యయుక్తుఁడై. ౫౨
శక్తి, గర్వ, మహంకార, మిచ్ఛ, యల్క. తమాశ్రమణ
మమతన్ వీడ శాంతుఁడై, బ్రహ్మ మొంద సమర్థుఁడౌ. ౫౩

బ్రహ్మంబయి ప్రసన్నుండై. విచారింపడు కోరడు
సర్వభూతాల దుల్యుండై. మేలౌ నాభక్తి నొందును. ౫౪

ఎంతవాడ. నెవండనో. నన్ భక్తి సరిగా గనున్
పైని నన్ సరిగా గాంచి. తర్వాత నన్నె చొచ్చును. ౫౫

ఎన్నండు గర్మ లన్నియు. జేసి నన్నాశ్రయించియు
నాయనుగ్రహముచేతన్. బొందున్ శాశ్వతమౌగతిన్. ౫౬

మదిచే సర్వకర్మల్ నా. కర్పించి మత్పరుండవై
బుద్ధియోగ మాశ్రయించి. నన్నెప్పుడు నెంచుము. ౫౭

నన్నెంచ దాటరానివి. యెల్లన్ దాటెదు నాకృపన్
మరి నీవా యహంకృతి. వినవేని నశింతువు. ౫౮

అహంకారముతో నీవు. "పోర" నని తలంచిన
ఈ నిశ్చయంబు వ్యర్థంబు. శాసించు నైజమే నినున్. ౫౯

నైజమౌ నీదుకర్మచే. బద్ధుండ వయి మూర్ఖతన్
జేయ నెంచని దానినే. చేతువు విధి లేకయే. ౬౦

యంత్ర మందున్నవానిని. బోలె భూతంబు లన్నిటిన్
మాయం ద్రిప్పుచు నీశుండు: భూతాళి హృది నిల్చును. ౬౧

అన్నిథాంల నీశునే, శరణుఁ జొమ్ము మర్జునా!
తత్కృప నుత్తమశాంతిఁగా, శాశ్వతస్థాన మొందెదు. ౬౨

నీ కిట్లతిరహస్యం బౌ, జ్ఞానంబు చెప్పఁగాఁబడెఁగా
దీనిఁగా బూర్తిగఁ జర్చించి, చేయు నీ కిష్ట మౌనటుల్. ౬౩

అన్నిటఁగా గడు గూఢంబౌ, నా శ్రేష్ఠవాక్య క్రమ్మఱన్
విను మెంతయు నిష్టుండవు. వని నీమేలు చెప్పెదన్. ౬౪

నన్ భావింపు నన్నె గొల్వు, నన్ బ్రేమ్ప నన్నె మ్రొక్కుమీ
నన్నె పొందెదు సత్యంబు, నాతోడు మా ప్రియుండవు. ౬౫

ధర్మంబు లెల్ల వర్జించి, నన్నొకండె శరణొందుమీ
సర్వ పాపాలనుండి నిన్, విడిపింతు; వగవ విడు. ౬౬

వివ:—ధర్మంబులు = వర్ణాశ్రమాది సర్వధర్మములు.

తపమున్ భక్తి సేవయు నేమియు లేని వానికిన్
నన్ను నిందించువానికిఁ జెప్పరాదిది యెన్నఁడున్. ౬౭

ఈ పరమరహస్యంబు, నాభక్తులకుఁ జెప్పువాఁ
డెంతయో భక్తి నాయందు, నిల్పి తప్పక నన్గనున్. ౬౮

వానికంటెను నాకిష్టు, తముండు లేఁడు మర్త్యులన్
వానికంటెను నాకిష్టు, తముఁడు పుట్టఁబోఁడికన్. ౬౯

ఎవ్వఁ డీధర్మయుక్తంబౌ, సంవాదము పఠించునో
ఆ జ్ఞానయజ్ఞనకు నే, సప్తుఁడ నని యెంచెదన్. ౭౦

అసూయ లేక శ్రద్ధతో, దీనిని విన్న మర్త్యుఁడు
ముక్తుండై పుణ్యకర్ముల, శుభలోకంబులఁ గనున్. ౭౧

ఏకాగ్రబుద్ధితోఁ బార్థ!, విన్నావు గద! దీనిని
అజ్ఞానంబునఁ బుట్టిన, వ్యామోహము నశించెనా. ౭౨

వ. అర్జునుఁ డనియె.

మోహంబు పోయె స్మృతియున్, వచ్చె నీదయ నచ్యుతా!
ఎల్ల సందేహముల్ పోయె. నీచెప్పి నట్లు చేసెదన్. ౭౩

వ. సంజయుఁ డనియె.

ఇట్లు మహాత్ముఁ డౌపార్థుఁ, డాశ్రీకృష్ణుఁడు చేసిన
గగుర్పాటిడునద్భుత, సంవాద మాలకించితిన్. ౭౪

యోగేశ్వరుండు కృష్ణుండు, సాక్షాత్తు చెప్పు చుండఁగా
వ్యాసుని దయవింటి నీ, విగూఢ మైన యోగమున్. ౭౫

పుణ్య మద్భుత మీకృష్ణా ర్జునసంవాదమున్ నృపా!
తలంచియుఁ దలంచియుఁ, బొంగిపోదున్ మఱిఁ మఱిన్.

ఆకృష్ణు నద్భుతాకృతిఁ, దలంచియుఁ దలంచియుఁగా
ఓరాజ! విస్మయం బగు, పొంగిపోదుఁగా మఱిన్ మఱిన్.

యోగి యాకృష్ణుఁ డెందుండు, నెందుండు ధన్వి పార్థుఁడు
అందే సిరియు సంపదల్, నీతి, గెల్పు, ధ్రువంబులు. ౭౮

ఇది

శ్రీమద్వేదవ్యాసమహర్షి రచిత భగవద్గీతలందు,
నుపనిషత్తులందు, బ్రహ్మవిద్యయందు, యోగ
శాస్త్రమందు, జనక గురుపర చర్ల నారా
యణశాస్త్రి కరుణాలబ్ధవిద్యుఁడగు
గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁ
బడిన తెనుఁగుగీతయందు
మోక్షయోగమను
పదునెనిమిదవ
యధ్యాయము
సమాప్తము.

# ఆర్షగ్రంథమాల

ప్రచురింపఁబోవునవి :

౧ ఉపనిషత్తులు.

౨ సిద్ధాంత దర్శనము (వ్యాసమహర్షి)

౩ బ్రహ్మసూత్రములు ..

౪ దర్శనములు.

చర్ల గణపతిశాస్త్రి.

నిడదవోలు

ప. గో. జిల్లా.



